


# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

వంట చేయడం నేర్చుకొనుట పెద్దగా పెరుగ నేర్చుకొనుటలో ఒక విధానం మాత్రమే. పళ్లు, పనుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమె వృద్ధాంగన యైనపుడు, ఆమె పళ్లు అప్పటికీ చెక్కుచెదర కుండా, సహజంగా వుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, అసహ్యకరమైన దంతక్షయం మరియు నొప్పి, పనుచిగుళ్ల బాధల బారినుండి ఆమెను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పుడో నేర్చుకోదగిన అత్యుత్తమ అలవాట్లను ఈనాడే బోధించండి— ఫోర్హన్స్' టూత్‌పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండుట. అమెరికా యందలి దంతవెద్యుడు ఆర్. జె. ఫోర్హన్‌చే నిర్మించబడిన ఫోర్హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లు, మెరిసే తెల్లని పళ్లకు తగిన ప్రత్యేక ఓషధిపదార్థములు గలది. ఇప్పుడే ఈ మంచి తీర్మానం చేయండి: జీవితకాల మంతయూ అనుసరించే 'అలవాటును మీపిల్లలకు నేడే ప్రారంభించండి...అది రోజూ ఫోర్హన్స్' టూత్‌పేస్టును వాడుటయే. ఒక ఉచిత ప్రతి చిన్న రంగుల పుస్తకం "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 15 న.పై. తపాలా బిళ్లలను పంపండి. మెసర్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name*........................................

*Address*........................................

C. I ........................................



# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



జలుబు
నొప్పులతో
మీ బిడ్డను
బాధపడనీయకండి

విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది...
మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది...
రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేత నంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెట్టండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

VV 464

★

మీరు మీ ఊరిలో మా "చంద మామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి ఒక్కొంటికి 15 పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసు కోండి.

★

చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మదరాసు - 26

★




1. చెరుకువాడ రామస్వామి, రాజమండ్రి

"స్వర్గారోహణం" [అక్టోబరు]లో నేతితో తడిపిన పురోడాశాలనే పిండిరొట్టెలతో హోమము చేయవలెనని వ్రాశారు. కాని అది సరికాదు. పురోడాశము అంటే యజ్ఞపశువుయొక్క గుండెమీది వప. దానిని మాత్రమే పురోడాశ మందురు.

మా వద్ద ఉన్న నిఘంటువులో పురోడాశమంటే "యజ్ఞార్థమైన అపూపము" అనీ, అపూపము అంటే "పిండివంట" అనీ ఉన్నది. యజ్ఞపశువు యొక్క వపకు పురోడాశ మనే అర్థం ఏ నిఘంటువులో ఉన్నదీ తెలియబరచండి.

2. జి. వి. రామారావు, కందుకూరు

"రామరాయలను గోలకొండ నవాబు హుసేన్ నిజామ్ షా తన చేత్తో చంపేశాడు" [ఆగస్టు] అని వ్రాశారు. అది తప్పు. గోలకొండ పరిపాలకులు కుతుబ్ షాలు కాని నిజాం షాలు కారు. రామరాయలను వధించినవాడు ఇబ్రాహింకులీ కుతుబ్ షా. సవరణ తెలుపగలరు.

అదీ తప్పే! రామరాయలను చంపినవాడు హుసేన్ నిజాం షాయే. అయితే అతను గోలకొండ నవాబు కాడు, అహ్మద్‌నగర్ పాలకుడు.

3. కుసుమంచి గోవిందరాజు, నెల్లిమర్ల

అన్నయ్యా, "చందమామ"లో శ్రీ కృష్ణదేవరాయల చరిత్ర చదివే అవకాశం పాఠకలోకానికి లభిస్తుందా?

అదివరకే లభించింది. జులై సంచికలో "భారత చరిత్ర" శీర్షికలో కృష్ణవదేరాయలకు సంబంధించిన వివరాలున్నాయి.

4. జి. దక్షిణామూర్తి, వరంగల్

"వందేమాతరం" జాతీయ గేయాన్ని వ్రాసిన బంకించంద్రుడు, మరియు "దుర్గేశనందిని" రచయిత ఒక్కరేనా? బంకించంద్రుడు ఆ గేయాన్ని ఎప్పుడు వ్రాసినాడో తెలుపగలరు.

"దుర్గేశనందిని" రచించిన బంకించంద్రుడే 'వందేమాతరం" గీతాన్ని రచించాడు. ఆయన ఆ గీతాన్ని "ఆనందమఠం" అన్న నవలలో రచించాడు. "ఆనందమఠం" 1882 లో రచించబడింది.



తాజా టీ
పరిమళమైన టీ
ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే
# టీ

*సాటిలేని టీ!*

* తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

* అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

* టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను,
ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే
టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్, లలిత్ లీఫ్ టీ,
మిలాప్ లీఫ్ టీ, బహదూర్ డస్ట్ టీ,
షాన్ డస్ట్ టీ



# కొత్త టైరా టివియస్ రిట్రెడా?

## ఏమో యజమానికే తెలియాలి!

మీవంటి విచక్షణగల కారు యజమాన్లు టైర్లను రిట్రెడ్ చేయించుకొని వాటివల్ల పూర్తి ప్రయోజనం పొందగోరుతారు. అయితే, రిట్రెడ్ అని స్పష్టంగా కనిపించే టైర్లు వాడటం మీకు ఇష్టముండదు. టివియస్ రిట్రెడ్ టైర్లు కొత్తవిలాగే కనిపిస్తయి: అవి రిట్రెడ్‌లని మీకు మాత్రమే తెలుసు.

**టివియస్ ఇండియాలో రిట్రెడ్ చేసే సంస్థల్లో కల్లా పెద్దది.**

## సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్




(టివియస్ సంస్థ) బెంగళూరు - కోయంబత్తూరు - మద్రాసు
పుదుక్కోటై - సికింద్రాబాదు - తిరునల్వేలి.

JWT/TVS/SI 2905




శుభోదయా వారి..

# వారసత్వం

దర్శకుడు:
చాణక్య

సంగీతం:
ఘంటసాల

నిర్మాతలు: యం.రంగా౬- శాస్త్రి

ఆంధ్ర = శ్రీ కృష్ణా పిక్చర్సు,
నైజాం = ఉషా ఫిలిమ్సు.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ" పుట్టినది మొదలు ప్రతి దీపావళికీ ప్రత్యేక సంచికలు ప్రచురిస్తూ వచ్చాం. కిందటేడు మాత్రమే ఈ ఆచారానికి భంగం కలిగింది. తిరిగి ఈ ఏడు ఎప్పటిలాగే "చందమామ" దీపావళి ప్రత్యేక సంచిక ప్రచురిస్తున్నాం. ఈ సంచికలోని ప్రత్యేకాకర్షణ పన్నెండు పేజీల రంగుల బొమ్మల కథా, నాలుగు పేజీల బొమ్మల కథా. ఈ దీపావళికి ఇదే పాఠకులకు మా కానుక.

సంపుటి 35 నవంబర్ 1964 సంచిక 5



# భారత చరిత్ర




బాబరు చనిపోయిన మూడు రోజుల అనంతరం హుమాయూన్ పట్టాభిషిక్తు డయాడు. అప్పు డతని వయసు ఇరవైమూడేళ్ళు. అప్పటి పరిస్థితి ఏమాత్రమూ బాగా లేదు. అతనికి అన్ని వైపులా అదృశ్య దుష్టశక్తులు పొంచి ఉన్నాయి. రాజ కుటుంబంలోనే ఐక్యత లేదు. హుమాయూన్ తమ్ముళ్ళు (కామ్రాన్, హిందాల్, అస్కరీ) కాక, అతని దాయాదులైన ముహమ్మద్ జమాన్, ముహమ్మద్ సుల్తాన్ అనే వాళ్ళు కూడా సింహాసనం మీద కన్ను వేశారు. దాని కోసం వాళ్ళు కత్తులు దూయటానికి కూడా సిద్ధంగానే ఉన్నారు. దర్బారులో కూడా కొందరు అమీర్ల కదే ఆలోచన!

దీనికి తోడు సేనలో కూడా ఐక్యత లేదు. అందులో నానా జాతుల వాళ్ళూ ఉన్నారు; వాళ్ళ మధ్య శత్రుత్వా లుండేవి. అందు చేత హుమాయూన్ తన బంధువులనుగాని, కొలువులో ఉన్న వాళ్ళనుగాని, సైన్యాన్నిగాని నమ్మే పరిస్థితి లేదు. సామ్రాజ్యం చూడబోతే కొత్తగా ఏర్పడినది, సుస్థిరమైనది కాదు. బాబరు చేత ఓడించబడినవా రెవరూ నిర్వీర్యులు కాలేదు. రాజపుత్రుల ఓటమి తాత్కాలికమైనది. అఫ్ఘానులు ఓటమి పొందారే గాని నిర్మూలించబడలేదు. చెల్లాచెదరై పోయిన అఫ్ఘాను కులీనులు తిరుగుబాటు కోసం వేచి ఉన్నారు; వారికి లేనిదల్లా సరి అయిన నాయకుడు. (షేర్ షా ఈ లోటును భర్తీ చేశాడు.) మరొక అంశ మేమంటే, గుజరాతును పాలించే బహదుర్ షా తన శక్తి పెంచుకుని హుమాయూన్‌కు తీవ్రమైన ప్రతి కక్షిగా పరిణమించాడు.

ఆ స్థితిలో హుమాయూన్‌కు అత్యవసరమైన లక్షణాలు—యుద్ధ తంత్రజ్ఞతా, రాజనీతిజ్ఞతా, పరిపాలనా సామర్థ్యమూ—







మూడూ లేవు. అందుచేత అతను తనకు తానే ప్రబల శత్రువై కూర్చున్నాడు. అతనికి ఉన్నతమైన అభిరుచులూ, సంస్కార ప్రియత్వమూ ఉన్నాయే గాని, తండ్రికి ఉండిన కార్యదీక్షా, పట్టుదలా లేవు. కొద్ది పాటి విజయం కంటబడితే చాలు జనానాలో దూరి, నల్లమందు వేసుకుని కలలుగంటూ, శత్రువుకు అవకాశ మిచ్చేవాడు. కఠినంగా శిక్షించవలసిన వారిని జాలి దలిచి మన్నించే వాడు. గుర్రం పైన ఉండవలిసిన తరుణంలో విస్తరిముందు కూర్చుని విందు కుడిచే వాడు. "హుమాయూన్" అంటే అదృష్టశాలి అని అర్థం. అతని కది సార్థక నామం కాదు.

తన సింహాసనం పై కన్ను వేసి ఉన్న తన తమ్ములను గట్టి అదుపులో ఉంచటానికి బదులుగా వారికి పరగణా లిచ్చే శాడు—అస్కరీకి సంభల్, పెద్ద తమ్ముడు కామ్రాన్‌కు కాబూల్, కందహార్‌లూ ఇచ్చాడు. ఈ కామ్రాన్ లాహోర్ లోని హుమాయూన్ సేనాపతిని బెదిరించి పంజాబునూ, దానికి తూర్పుగా ఉండే హిస్సార్ ఫీరూజనూ కూడా కాజేశాడు. ఈ విధంగా హుమాయూన్ తన తండ్రి కూర్చిన సామ్రాజ్యాన్ని తునాతునకలు చేసేశాడు. సింధు




ప్రాంతమూ, దాని అవతలి ప్రాంతమూ సైనిక సమీకరణకు సర్వోత్తమమైన దేశాలు; అవి కాస్తా కామ్రాన్ అధీన మయాయి. హిస్సార్‌ఫీరూజ వశంకావటంతో పంజాబు నుంచి ఢిల్లీకి వెళ్ళే రహదారి కూడా కామ్రాన్‌కు హస్తగతమయింది.

అయితే తొలి యుద్ధాలలో హుమాయూన్‌కు విజయం లభించక పోలేదు. బుందేల్ ఖండ్ లోని కాలింజల్ రాజా అఫ్ఘానుల పక్షపాతి అన్న అనుమానంతో, హుమాయూన్ తాను గద్దె ఎక్కిన అయిదారు మాసాల తరవాత ఆ రాజా పైకి యుద్ధానికి వెళ్ళాడు. అయితే తూర్పున

అఫ్ఘానుల దుశ్చర్యలు మితిమీరటం చేత అతను కాలింజరు రాజా వద్ద కొంత పరిహారం పుచ్చుకుని వచ్చెయ్యవలిసి వచ్చింది. దౌరా వద్ద అతను అఫ్ఘానుల పై ఘన విజయం సాధించి, జౌన్పూర్ నుంచి సుల్తాన్ మహ్మూద్ లోడీని తరిమివేశాడు. అఫ్ఘాన్ యోధుడైన షేర్ ఖాన్ అధీనంలో ఉన్న చునార్‌ను హుమాయూన్ ముట్టడించాడు; అయితే అక్కడి తిరుగుబాటును నిర్మూలించకుండానే, షేర్ ఖాన్ నామ మాత్రపు లొంగుబాటును ఆమోదించి ముట్టడి ఎత్తివేశాడు. ఆ కారణంగా, హుమాయూన్ పశ్చిమాన గుజరాతు పాలకుడైన బహదుర్ షాతో తలపడుతున్న సమయంలో షేర్ ఖాన్ తన శక్తులను బాగా పెంచుకో గలిగాడు.

హుమాయూన్ బహదుర్ షా పైకి ఎత్తి వెళ్ళటానికి తగినంత కారణం ఉన్నది. అతని ప్రబల శత్రువులైన అనేకమంది అఫ్ఘాన్ శరణార్థులను బహదుర్ షా చేరదీశాడు. మేవాడ్ సామ్రాజ్యం క్షీణస్థితిలో ఉండటం ఆసరా చూసుకుని తన రాజ్యాన్ని విస్తృతం చేసుకున్నాడు. హుమాయూన్ అఫ్ఘానుల పై తాను సాధించిన విజయాన్ని గాలికి వదిలేసి, 1534 లో మాల్వా వద్దకు చేరే సమయానికి, మాల్వాను అదివరకే తన రాజ్యంలో కలుపుకున్న బహదుర్ షా చితోడ్ దుర్గాన్ని ముట్టడించాడు.

బహదుర్ షాతో సతమత మవుతున్న మేవాడ్ రాణి కర్ణావతి తన శత్రువును ప్రతిఘటించటానికి హుమాయూన్ సహాయం అర్థించింది. హుమాయూన్ ఆమె ప్రార్థనను తోసి పుచ్చుటమేగాక, స్వప్రయోజనదృష్ట్యా అయినా వెంటనే బహదుర్ షాను ప్రతిఘటించాడు కాడు; బహదుర్ షా తుర్కీ ఇంజనీర్ల సహాయంతోనూ, పాశ్చాత్యుల ఫిరంగులతోనూ రాజపుత్రులను ఓడించి, చితోడ్ దుర్గాన్ని మట్టుపెడుతుంటే మొగలు చక్రవర్తి చూస్తూ ఊరుకున్నాడు!



# నేహ్రూ కథ

## 5



1907 అక్టోబరులో, తనకు పద్దెనిమిదేళ్ళు నిండ నుండగా, జవాహర్ కేంబ్రిజ్ విశ్వ విద్యాలయానికి చెందిన ట్రినిటీ కాలేజీలో చేరాడు. అప్పట్లో ఆ విశ్వవిద్యాలయంలో ప్రకృతి శాస్త్రాధ్యయనం ప్రఖ్యాతంగా ఉండేది. జవాహర్ అక్కడ రసాయన, భూతత్వ, వృక్ష శాస్త్రాలు తీసుకున్నాడు. కాని చరిత్రలోనూ, సాహిత్యంలోనూ అతని ఆసక్తి ఏమాత్రమూ తగ్గలేదు.

జవాహర్ విశ్వవిద్యాలయంలో మూడేళ్లు గడిపాడు. అక్కడ ఆయన సహవిద్యార్థులలో కొందరు జాతీయోద్యమంలో పాల్గొన్న వాళ్ళు కూడా ఉన్నారు. వారిలో బెంగాలు నాయకుడు జె. ఎం. సేన్‌గుప్త ఒకడు. నేహ్రూ మంత్రివర్గంలో ఒకడుగా ఉండిన సయ్యద్ మహ్మూద్, అహ్మద్‌ఖాన్ షేర్వానీ, సయీఫుద్దీన్ కిచ్లూ—వీరంతా జవాహర్ సహవిద్యార్థులే. శ్రీప్రకాశ (మద్రాసు, మహారాష్ట్రల మాజీ గవర్నరు) జవాహర్ విశ్వవిద్యాలయం వదిలిపెట్టిన ఒక ఏడాదికి కేంబ్రిజ్‌లో చేరాడు.

వీరిద్దరూ తరువాతి కాలంలో మంచి మిత్రులయారు. వారి తొలి సమావేశం ఈ విధంగా జరిగింది.

1911 డిసెంబరులో లండనులోని ఒక భారతీయుల ఇంట శ్రీప్రకాశ మొదటి సారిగా జవాహర్‌ను చూశాడు. జవాహర్ పాశ్చాత్య దుస్తులు ధరించి డ్రాయింగ్ రూమ్‌లోకి ప్రవేశించి, చలి మంటకు ఎదురుగా నిలబడి, అనేక విషయాలను గురించి విపులంగా ప్రసంగించాడు. కొంత సేపయాక తనకు ఆకలిగా ఉందని చెప్పి, స్వతంత్రంగా అడిగి భోజనం పెట్టించుకు తిన్నాడు.









ఎందుకంటే అతను వారితో మనసిచ్చి మాట్లాడేవాడు కాడు. కాని నిజమైన మిత్రుల వద్ద అతను దీనికి పూర్తిగా విరుద్ధంగా ప్రవర్తించేవాడు; ఎంతో చలాకీగానూ, ఆత్మీయంగానూ ఉండేవాడు. జవాహర్ ఆప్త మిత్రులలో డాక్టర్ ఖాన్ సాహిబ్ ఒకడు. ఈయన "సరిహద్దు గాంధీ" అని ప్రఖ్యాతి కెక్కిన అబ్దుల్ గఫర్‌ఖాన్ తమ్ముడు. ఆ రోజుల్లో ఖాన్ సాహిబ్ లండనులోని సేంట్‌టామస్ హాస్పిటల్‌లో విద్యార్థిగా ఉండేవాడు. జవాహర్ అతన్ని దాదాపు ప్రతి రోజూ కలుసుకునేవాడు. ఖాన్ సాహిబ్ ఒక్కొక్కసారి జవాహర్‌ను తన వీపు పైన ఎక్కించుకుని డాన్సు చేసేవాడు కూడా!

ఈ విధంగా ఉత్సాహం ఉన్నప్పుడు చిన్న పిల్లాడిలాగా ఆడుకునే శక్తి జవాహర్‌కు వార్ధక్యంలో కూడా ఉంటూనే వచ్చింది. ఆయన తన మనమలతో సమంగా గంతులు వేసేవాడు, వాళ్ళ మూడు చక్రాల సైకిళ్ళెక్కి తొక్కేవాడు.

జవాహర్ కేంబ్రిజ్ విశ్వవిద్యాలయంలో ఉండగా అతని ముద్ర అక్కడి జీవితం పైన గాని, ఆ విశ్వవిద్యాలయంలో ఆ సమయంలో చదువుతూ ఉండిన నూరు చిల్లర భారతీయ విద్యార్థుల పైన గాని ఏవిధం

చాలా పొద్దు పోయాక శ్రీప్రకాశతో సహా జవాహర్ ఇంటికి బయలుదేరాడు. బస్సులూ, "ట్యూబ్" రైళ్ళూ ఆగిపోయాయి. టాక్సీలు దొరకటం తేలికకాదు.

"ఇంటి కెలా వెళతావు?" అని శ్రీప్రకాశ జవాహర్‌ను అడిగాడు. శ్రీప్రకాశ ఇల్లు అక్కడికి చాలా దగ్గిరే, కాని జవాహర్ చాలా దూరం వెళ్ళాలి.

"నన్ను గురించి విచారించకు. నా సంగతి నేను చూసుకోగలను," అంటూ జవాహర్ చీకట్లోకి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

అతన్ని చూసి కొందరు పరిచయస్తులు చాలా గోప్యమైన మనిషి అనుకునేవారు;



గానూ పడలేదు. వారిలో చాలా మందికి జవాహర్‌ను చూసిన గుర్తు కూడా లేదు.

కేంబ్రిజ్‌లో భారతీయ విద్యార్థులకు మజ్లీస్ అనే ప్రత్యేక సంస్థ ఉండేది. జవాహర్ అక్కడి సమావేశాలకు తరుచు వెళ్ళేవాడు. అక్కడ ప్రతి వారమూ ఏవో చర్చలు జరిగేవి. తరుచు ఈ చర్చలు భారత రాజకీయ సమస్యలకు సంబంధించి ఉండేవి. జవాహర్‌కు అసలే బిడియం; దానికి తగ్గట్టుగా మజ్లీస్ చర్చలలో విషయం కన్న, ఉపన్యసించే విధానం అతి ముఖ్యంగా ఉండేది. అందుచేత ఆ చర్చలు జవాహర్‌కు ఆగ్రహం కలిగించేవి. ఇలాటి కారణాల వల్లనే అతను తన కాలేజీ డిబేటింగ్ సొసైటీలో కూడా సామాన్యంగా మాట్లాడే వాడు కాడు. ఏ విద్యార్థిగాని ఒక టరమ్‌లో ఒక్కసారైనా మాట్లాడకపోతే జరిమానా ఇచ్చుకోవాలన్న నియమం ఉండేది. జవాహర్ సాధారణంగా ఆ జరిమానా ఇచ్చేస్తూ ఉండేవాడు.

కేంబ్రిజ్ విశ్వవిద్యాలయం సందర్శించ టానికి భారతదేశం నుంచి అనేక మంది ప్రముఖులు వస్తూండేవారు. వారిలో రాజ కీయ నాయకులు కూడా ఉండేవారు. ఒక సారి బెంగాలు నుంచి బిపిన్ చంద్రపాల్



వచ్చాడు. ఆయన, వినేవాళ్ళు ఒకరిద్దరే అయినప్పటికీ, దద్దరిల్లే గంభీరోపన్యాసాలు చేసేవాడు. ఆయన పన్నెండు మంది భార తీయ విద్యార్థుల సమక్షంలో ఒక చిన్న గదిలో చేసిన ఉపన్యాసం విని జవాహర్ ఆ హోరు భరించలేకపోయాడు; మాటలు కొంచెంకూడా అర్థంకాలేదు.

జవాహర్, లాలా లజపత్రాయ్ ఉపన్యా సాలూ, గోపాలకృష్ణ గోఖలే ఉపన్యాసాలూ కూడా విన్నాడు. గోఖలే భారతీయ అగ్ర నాయక శ్రేణికి చెందినవాడు. మితవాదిగా తిలక్‌కు పూర్తిగా వ్యతిరేకి అయినప్పటికీ దూరదృష్టి గల రాజకీయవేత్త. దురదృష్ట

వశాన ఆయన తన నలభై తొమ్మిదవ యేటనే, 1915 ఫిబ్రవరిలో మరణించాడు.

జవాహర్ తన ఇరవైయో ఏట, 1910లో, కేంబ్రిజ్ చదువు పూర్తి చేసి, రెండవ శ్రేణిలో ఆనర్సు పట్టభద్రు డయాడు. అతను తరవాత ఏమి చెయ్యాలన్న ప్రశ్న వచ్చినప్పుడు ఐసియస్ (ఇండియన్ సివిల్ సర్వీసు) పోటీ పరీక్షకు కూర్చోవాలన్న సూచన వచ్చింది. జవాహర్ జాతీయ భావాలు అతని హృదయంలో గాఢంగా నాటుకుని ఉన్నపక్షంలో, ఐ.సి.యస్. పాసై, బ్రిటిషు పాలకుల చేతి కింద పని చేస్తూ స్వదేశాన్ని దాస్యశృంఖలాలలో ఉంచటం అతనికి అభ్యంతరకరంగా తోచి ఉండ వలిసిందే. కాని తన కప్పుడు అలాటి అభ్యం తరం తట్టలేదని ఆయన తన స్వీయ చరిత్రలో చెప్పుకున్నాడు.

జవాహర్ ఐ.సి.యస్. అధికారి అయి ఉంటే చరిత్ర గతి ఎలా ఉండేదో, నేహ్రూ జీవితం ఏవిధంగా నడిచి ఉండేదో చెప్పలేం. కాని అతను ఐ.సి.యస్. పరీక్షకు కూర్చునే ఆలోచనను విడిచిపుచ్చటానికి రెండు బల మైన కారణాలు తోడ్పడ్డాయి. మొదటిది, ఐ.సి.యస్. పరీక్షకు కూర్చునే వారికి కనీసం 22 ఏళ్ళుండాలి; అంటే జవాహర్ మరి మూడేళ్ళపాటు తల్లి దండ్రులకు దూరంగా ఉండిపోవా లన్నమాట. రెండవది, ఐ.సి. యస్. పాసైతే బ్రిటిషు అధికారులు అతనికి ఏ మారుమూలనో ఉద్యోగం ఇవ్వవచ్చు; ఉద్యోగరీత్యా అతను అయిన వాళ్ళకు దూరంగా ఉండిపోవలిసి వస్తుంది.

అందుచేత, చిట్టచివరకు, జవాహర్ కూడా తన తండ్రి వృత్తినే అవలంబించి న్యాయవాది కావాలన్న నిర్ణయం జరిగింది. జవాహర్ తన బసను కేంబ్రిజ్ నుంచి లండనుకు మార్చి, "లా" పరీక్షలు ఒక టొకటే "సాధారణ" శ్రేణిలో పాస వుతూ వచ్చాడు.






# 6

[ జగతసింహుణ్ణి కలుసుకుని తన చెలి వృత్తాంతం చెబుతానని మాట ఇచ్చిన విమల గడువునాటి రాత్రి శైలేశ్వర మందిరానికి వెళ్ళింది. తిలోత్తమ వీరేంద్రసింహుడి కుమార్తె అని తెలియగానే జగతసింహుడు హతాశుడయాడు. ఒక్కసారి తిలోత్తమను చూడగోరి అతను విమల వెంట మందారణ దుర్గానికి వచ్చాడు. విమల పొరపాటు చేత ఒక పఠానువాడు దుర్గంలో ప్రవేశించాడు. ఆ సమయంలో— ]

జగతసింహుడు విమల తెచ్చిన బల్లాలు రెండూ తీసుకుని, వెనక ఎక్కిన చెట్టే మళ్ళీ ఎక్కాడు. ఇప్పు డతనికి దూరపు చెట్టు ఆకుల మధ్య ఒక్క తలపాగాయే కనిపించింది; రెండోది లేదు. అతను ఆ కనిపించే తలపాగా కేసి గురిచేసి ఒక బల్లాన్ని ఎంత బలంతో విసిరాడంటే, తలపాగావాడు తక్షణమే కింద పడిపోయాడు. జగతసింహుడు చప్పున దిగి వచ్చి ఆ వ్యక్తిని సమీపించాడు. సాయుధ సైనికుడిలా కనిపించే ఒక ముసల్మాను వాడు చచ్చిపడి ఉండటం అతనికి కనిపించింది. బల్లెం అతడి కంటి కుండా మెదడులోకి చొచ్చుకు పోయింది.

ఆ సైనికుడి కవచంలో నుంచి ఏదో కాగితం సగం పైకి వచ్చి జగతసింహుడి

బంకించంద్ర చట్టోపాధ్యాయ





అమె అతన్ని ఒక శయ్యాగారం వద్దకు తీసుకుపోయి, "నే నిప్పుడే తిరిగి వస్తాను. మీరు వెళ్ళి తల్పం పైన విశ్రమించండి," అని చెప్పింది.

ఆమె వెళ్ళి తిరిగి వచ్చి, తలుపు తెరిచి, "యువరాజా, మాట," అన్నది. యువ రాజు కంపిత హృదయంతో లేచి, విమల వెంట అంతఃపురంలోని ఒక గది వద్దకు చేరుకున్నాడు. వెంటనే విమల అక్కడి నుంచి నిష్క్రమించింది. గది నుంచి కమ్మని వాసనలు వస్తున్నాయి. దీపం ప్రకాశిస్తున్నది. గదిలో ఒక నవయువ్వని తల వంచుకుని కూర్చుని ఉన్నది. ఆమే తిలోత్తమ.

విమల యువరాజును గది వద్దకు చేర్చి తన గదికి వెళ్ళిపోయింది. ఆమె ముఖాన ఆనందం తాండవిస్తున్నది, ఎందు కంటే అమె మనోరథం ఈనాడు సిద్ధించింది. ఆమె అద్దం ముందు నిలబడి తన రూప లావణ్యాలను చూసుకుని మురిసి పోయింది. తరవాత ఆమె తిరిగి వచ్చి, శయ్యపై కూర్చుని జగత సింహుడి కొరకు నిరీక్షించసాగింది.

ఇంతలో వెలుపల తోటలో బాకాధ్వని పెద్దగా వినపడింది. అమె ఉలికి పడింది. తూర్యధ్వనులు ముఖద్వారం నుంచి విని

కంట పడింది. అతనా కాగితాన్ని తీసి వెన్నెల కాంతిలో ఇలా చదువుకున్నాడు: "ఈ పత్రం గలవాడు చేసే ఆజ్ఞలను కతలూఖాన్ అనుచరులు నిర్వర్తిస్తారుగాక."

విమల కీ గొడవ కొంచెం కూడా తెలియదు. ఆమె యువరాజును చేర వచ్చి, "బయట ఉండటం క్షేమం కాదు. దుర్గం లోకి పోదాం పదండి. నేను పొరపాటున రహస్య ద్వారాన్ని మూయకుండా వచ్చేశాను," అన్నది.

ఇద్దరూ గుండెలు పిచ పిచ లాడుతూ దుర్గాన్ని ప్రవేశించారు. విమల రహస్య ద్వారాన్ని లోపలి నుంచి బంధించింది.

పించాలి గాని, వెనుక నుంచి వినిపించట మేమిటి? ఇందులో ఏదో వైపరీత్యం ఉందని శంకించి ఆమె భయ విభ్రాంతు రాలయింది. ఆమె కిటికీ వద్దకు వెళ్ళి, వెనుక ఉన్న తోట నాలుగు మూలలూ కలయ జూసింది, కాని ఏమీ కనిపించలేదు.

విమల తన గది నుండి బయటికి వచ్చి, రహస్యమార్గాన మెట్లెక్కి డాబా మీదికి వెళ్ళి, దృష్టి అన్ని పక్కలా ఎంతో దూరం సారించింది, కాని గాఢాంధకారంలో ఏమీ కనిపించ లేదు. ఆమె మిద్దె మీది గోడ వెంబడి ఒక చివరకు వెళ్ళి, అక్కడి నుంచి తిరిగి వస్తూండగా, తన వీపు మీద ఎవరో వేలు పెట్టినట్టయింది. ఆమె గతుక్కుమని వెనక్కు తిరిగే సరికి ఒక అపరిచితుడు అస్త్రధారి అయి కనిపించాడు. విమల కొయ్యబారి పోయింది.

"అరవకు. ఆందగత్తెలు అరవటమూ, కెవ్వుమనటమూ బాగుండదు," అన్నాడా మనిషి.

విమల అతణ్ణి ఆపాదమస్తకమూ చూసి అతను సామాన్య సైనికుడు కాడని గ్రహించింది. చతురురాలైన విమల క్షణంపాటే నిస్తబ్ధ అయింది. ఆమె అంతలోనే తన చైతన్యాన్ని తిరిగి పొంది, "ఎవరు నీవు?" అని ఆ వ్యక్తిని అడిగింది.






" నా పరిచయం వల్ల నీకేం లాభం?" అని అత నడిగాడు.

" నీవు దుర్గంలోకి ఎలా ప్రవేశించావు? దొంగలను కొరతవేస్తారని వినలేదా?" అన్నది విమల.

" సుందరీ, నేను దొంగను కాను."

" దుర్గంలోకి ఎలా జొరబడ్డావు?"

" నీ దయవల్లనే. నీవు రహస్యద్వారం తెరుచుకుని తోటలోకి వెళ్ళేటప్పుడు నా అదృష్టం కొద్దీ దాన్ని తెరిచి ఉంచి వెళ్ళావు. ఆ సమయంలో నేను లోన ప్రవేశించాను. ఇప్పుడు మిద్దె మీద నిన్ను అనుసరించి వస్తున్నాను."

" ఇంతకూ నీ వెవరు?"

" పఠానును. ఈ దాసుడి పేరు ఉస్మాన్ ఖాన్...గుర్తు రాలేదా? ఇంకా వివరంగా చెప్పాలా? కతలూఖాన్‌యొక్క సేనాపతిని," అన్నాడా పఠాను.

విమల నిలువునా కంపించి పోయింది. యువరాజు కీ సమాచారం ఎలా అంద జేయాలా అని గిలగిలలాడింది; అందుకు మార్గమే కనిపించలేదు. అందుచేత చివర కామె ఆ పఠానువాణ్ణి సాధ్యమైనంత సేపు అక్కడి నుండి కదలకుండా చెయ్యటం మంచిదని నిశ్చయించుకున్నది. ఇంతలో ఎవడైనా దుర్గానికి చెందిన సైనికు డటుగా వచ్చి, పరిస్థితి గ్రహించి. ప్రతిక్రియ కొరకు ప్రయత్నించవచ్చు. ఆమె ఉస్మాన్‌ఖానును మాటలలోకి దింపింది.

ఆమె తన నెలాగైనా మిద్దెపైనే నిలిపి ఉంచటానికి తన చాతుర్యమంతా వినియో గిస్తున్నదని ఉస్మాన్‌ఖాన్ చివరకు గ్రహించి, " నీ పైబట్ట కొంగున కట్టి ఉన్న తాళపు చెవులగుత్తి మర్యాదగా నా కిచ్చెయ్యి. నీ వంటి పై చెయ్యివేసి నీ మానానికి కళంకం కలిగించటం నా కిష్టంలేదు," అన్నాడు.

తన ఆట కట్టయిపోయినట్టు విమల తెలుసుకున్నది. బలాత్కారంగా తాళపు



చెవులను లాక్కోగలవాడు అంత మర్యాదగా మాట్లాడటం వెటకారం గాక మరేమిటి?

ఆమె తన పైబట్టను తీసి చేతిలో పట్టుకుంటూ, "అయ్యా, నా అంతట నేను తాళపుచెవు లివ్వకపోతే, మీ రెలా తీసుకుంటారు?" అన్నది.

"మర్యాదగా ఇవ్వకపోతే నిన్ను స్పృశించవలసి వస్తుంది," అన్నాడు ఉస్మాన్‌ఖాన్

"తీసుకోండి," అంటూ ఆమె తన పై బట్టను తోటలోకి విసిరింది. ఉస్మాన్ ఖాన్ చెయ్యి చాచి బట్టను అందుకుని, దాని కొంగు నుంచి తాళపు చెవులగుత్తిని తీసి, తన మొలలో దోపుకుని, ఆ పై బట్టతోనే విమలను గట్టిగా బంధించి, మెట్ల మీదుగా కిందికి దిగి వెళ్ళిపోయాడు.

విమల గట్టిగా అరిచి కేకలు పెట్టింది, కాని వాటిని విన్నవారు లేరు. కిందికి వెళ్ళిన ఉస్మాన్‌ఖాన్ మొదట విమల గదిలోకి వెళ్ళాడు. తాళపుచెవుల సహాయంతో రహస్యద్వారం తెరిచాడు. తెరిచిన ద్వారం కుండా ఒక్కొక్కరుగా అనేక మంది సైనికులు లోపలికి వచ్చారు. చివర కతను, "ఇంక చాలు. మిగిలిన వాళ్ళు బయటనే ఉండండి. నేను సంకేతం ఇవ్వగానే కోటను



ఆక్రమించండి. ఈ మాట తాజ్‌ఖాన్‌కు చెప్పాలి," అన్నాడు.

ఉస్మాన్ వెంట సైనికులు లోపల ప్రవేశించారు. అత నొక సైనికుణ్ణి మిద్దె పైకి తీసుకుపోయి, విమలను అతనికి చూపి, "ఈమె చాలా చాతుర్యం గలది. ఈమెనే మాత్రమూ నమ్మవద్దు, రహీమ్‌శేఖ్. నిన్నీమెకు కాపలా ఉంచుతున్నాను. ఈమె పారిపోవటానికి గాని, కేకలు పెట్టటానికి గాని యత్నించిందో నరికెయ్యి, ఆడదని ఏమీ చూడవద్దు. తెలిసిందా?" అన్నాడు.

"జోహుకుమ్," అని రహీమ్‌శేఖ్ విమలకు కాపలా ఉండిపోయాడు.





ఉస్మాన్‌ఖాన్ వెళ్ళిపోగానే విమలకు ధైర్యం వచ్చింది, చాకచక్యం వినియోగించి బంధవిముక్తి పొందవచ్చునన్న నమ్మకం కూడా కలిగింది. తన చెంత నిలబడి ఉన్న కాపలావాడితో ఆమె సంభాషణ పెట్టుకున్నది. ఒక అందమైన ఆడది తన సుఖ దుఃఖాలను గురించీ, గృహ విషయాలను గురించీ సానుభూతితో అడుగుతూంటే సామాన్య సైనికుడి హృదయం కరిగిపోవటంలో ఆశ్చర్య మేమిటి? రహీమ్‌శేఖ్ విమల చల్లిన మచ్చుమందు ప్రభావానికి పూర్తిగా వశుడైపోయాడు. ఇది గమనించి విమల అతడితో తనకు చాలా భయంగా ఉన్నదని చెప్పి, సమీపంగా వచ్చి కూర్చోమన్నది. అతను సంతోషంతో వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు.

"శేఖ్‌జీ, మీ నుదిటి మీద అంత చెమటేమిటి? ఒక్కసారి నా కట్లు విప్పరాదా? కాస్సేపు విసురుతాను. తరవాత మళ్ళీ బంధించవచ్చు," అన్నది విమల. అతని నుదిటి మీద చెమట ఏ మాత్రమూ లేదు. అయినా అతను ఆమె చేత విసిరించుకుని ఆనందించటానికిగాను ఆమె చేతులకు కట్టిన పై బట్ట విప్పేశాడు.

విమల ఆ బట్టతో కాస్సేపు అతనికి విసిరి, దానిని తన ఒంటి పైన వేసేసు



కున్నది. రహీమ్‌శేఖ్ ఆమె చేతులను తిరిగి బంధించే మాట తలపెట్టలేదు. పై బట్టను ధరించి పక్కన కూర్చుంటే ఆమె సౌందర్యం రెట్టింపయినట్టుగా అతడికి తోచింది.

"శేఖ్‌జీ, నీ భార్యకు నీ వంటే ప్రేమ లేదా?" అన్నది విమల.

"అదేమిటి? లేకేం?" అన్నాడు రహీమ్ శేఖ్ ఆశ్చర్యంగా.

"ప్రేమే ఉంటే ఈ వసంతకాలంలో నిన్ను విడిచి ఉండ గలదా?" అన్నది విమల. వసంతకాలం వెళ్ళిపోయి మూడు నెల లయింది. కాని ఆ మూఢుడికి విమల రూపంలో వసంతం ఎదురుగా ఉన్నట్టే తోచింది.

విమల తనను ప్రేమిస్తున్నదనీ, తనతో లేచిపోయి రావటానికి సిద్ధంగా ఉన్నదనీ అతను నమ్మేలాగా ఆమె అతనికి కబుర్లు చెప్పింది.

"ఇదుగో, ఈ యుద్ధంలో జయం లభించి నే నింటికి తిరిగి వెళ్ళేటప్పుడు నిన్ను తప్ప కుండా వెంట పెట్టుకుపోతాను. ఇక్కడ మా నాయకుడు పెట్టే బాధలు భరించ లేకుండా ఉన్నాను," అన్నాడు రహీమ్. అతను విమల విచారంగా ఉండటం చూసి, "ఏమిటాలోచిస్తున్నావు?" అన్నాడు.



"ఆలోచించేటందు కేమున్నదీ? నాకు సుఖం రాసిపెట్టిలేదు. మీరీ దుర్గాన్ని జయించలేరు," అన్నది విమల.

"ఏం?"

"ఒక రహస్యం ఉన్నది."

"ఏమిటది? త్వరగా చెప్పు."

"జగతసింహుడు పదివేల సేనతో ఈ ప్రాంతంలోనే ఉన్నాడు. ఇవాళ మీరు రహస్యంగా దుర్గాన్ని ముట్టడించబోతున్నారని తెలిసి, అతను మీ కన్న ముందుగానే వచ్చి కూర్చున్నాడు. అతను ఇంతలో తొందరపడి ఏమీ చెయ్యడు; మీరు విజయం పొంది నిశ్చింతగా ఉన్న సమయంలో మీ పైన వచ్చి పడతాడు," అన్నది.

"అదా సంగతి?" అన్నాడు రహీమ్.

"ఈ సంగతి కోటలో ఉండే వారందరికీ తెలుసును," అన్నది విమల.

రహీమ్ పరమానందంతో, "ఇవాళ నాకు నువ్వెంత గొప్ప ఉపకారం చేశావో తెలుసా? నేను వెళ్ళి సేనాపతితో చెప్పానంటే నాకు మంచి బహుమతి దొరుకుతుంది. నే నాయనతో ఈ మాట చెప్పి వస్తాను. నేను వచ్చినదాకా ఇక్కడే ఉండు!" అంటూ వెళ్ళిపోబోయాడు.

అతని కామెపై ఆవంత అనుమానం కూడా కలగలేదు.

"నువు మళ్ళీ వస్తావా? అదే పోత పోతావా?" అని విమల అడిగింది.

"ఇప్పుడే వస్తాను. నిజంగా వస్తాను."

"నన్ను మరిచి పోయేట్టుంటే వెళ్ళకు," అన్నది విమల.

"మరవను. ఒక్కనాటికి మరవను."

"రాకపోతే నా మీద ఒట్టే."

"అనుమానించకు, తప్పక వస్తాను," అంటూ రహీమ్‌శేఖ్ దౌడు తీశాడు.

అతను కనుచూపు మేర దాటగానే విమల తన దారిన తాను వెళ్ళిపోయింది.

—(ఇంకా వుంది)



# పూర్వజన్మస్మృతి

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, సకల సౌఖ్యాలూ అనుభవించుతూ, హాయిగా వుండవలసిన నీవు ఈ విధంగా శ్రమించటం చూస్తూంటే నాకు సారణదేశపు రాణి రత్నావళి కథ గుర్తు కొస్తున్నది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందుల కామె కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం సారణదేశంలో ఒక చండాలుడుండే వాడు. వాడు ఊరికి దూరంగా ఒక నిర్జన ప్రదేశంలో ఒక గుడిసె వేసుకుని అందులో కాపుర ముండేవాడు. వాడూ, వాడి భార్యా, నలుగురు కొడుకులూ కటిక దారిద్ర్యం అనుభవిస్తూ జీవయాత్ర సాగించారు. వాళ్ళేనాడూ గంజి తప్ప భోజనం

## బేతాళ కథలు



ఎరగరు. ఒక్కొక్కసారి అదీ దొరక్క ఇన్ని మంచి నీళ్ళు తాగి పడుకునే వాళ్ళు.

చండాలుడి భార్య చాలా ఉత్తమురాలు. కోపిష్ఠి మొగుడు తనను తన్నినా, పిల్లలను తన్నినా ఏమీ మాట్లాడేది కాదు. ఎంతెంత కష్టాలు వచ్చినా భూదేవిలా సహించేది. ఆమెది జాలి గుండె. తన కష్టాలను లక్ష్యం చెయ్యని మనిషి. ఎవరికే మాత్రం కష్టం కలిగినా ఎంతో బాధ పడేది.

ఒక రోజు మధ్యాహ్నం వేళ ఆమె కడవ తీసుకుని నీళ్ళ కోసం దిగుడు బావి దగ్గిరికి వెళ్ళింది. అక్కడ దాహంతో తపన పడుతున్న ఒక ఆవు ఆమెకు కనిపించింది. దిగుడు బావి చాలా లోతు. ఆవు అందులోకి దిగి నీళ్ళు తాగలేదు. ఆమె బావిలోకి దిగి, కడవతో నీళ్ళు తెచ్చి ఆవు ముందుంచింది. కాని కడవ మూతి చిన్నది కావటం చేత ఆవు నీరు తాగలేక పోయింది. అందు చేత ఆమె కడవ పై భాగాన్ని రాతితో పగల గొట్టి, కింది భాగాన్ని బోలెలాగా తయారు చేసింది. అప్పు డావు నీరు తాగ గలిగింది. ఆమె ఆ బోలెతో బావి నుంచి చాలా సార్లు నీరు తెచ్చి ఆవు చేత తాగించింది. చివరకు దాహం తీరి ఆవు వెళ్ళి పోయింది.

కడవతో నీళ్ళ కోసం వెళ్ళిన మనిషి ఉత్త చేతులతో తిరిగి వచ్చేసరికి ఆమె



భర్తకు పట్టరాని ఆగ్రహం వచ్చి, "నీళ్ళ కని వెళ్ళి ఇంత సేపయాక నీళ్ళు లేకుండా వస్తున్నావా, ఛడవా ముండా?" అని, తన చెప్పులు కుట్టే ఆరెను ఆమె పైన విసిరి కొట్టాడు. దురదృష్ట వశాన ఆ ఆరె ఆమె కణతలో దిగబడింది. ఆమె కిక్కురు మన కుండా స్పృహ తప్పి పడిపోయి, కొద్ది సేపట్లో ప్రాణాలు వదిలింది.

ఆమెను తీసుకు పోవటానికి స్వర్గం నుంచి దేవతలు విమానం పంపారు. ఆమెను దేవేంద్రుడి సమక్షంలోకి తీసుకు పోయారు. దేవేంద్రు డామెతో, "అమ్మా, దాహంతో చచ్చిపోతున్న ఆవుకు జల దానం చేసి ప్రాణాలు నిలబెట్టావు గనక, ఎన్ని యజ్ఞాలు చేసినా లభించని పుణ్యం సంపాదించుకుని, ఉత్తమ లోకాలలో దివ్య సౌఖ్యా లనుభ వించే అర్హత పొందావు. అయితే నీకు సంప్రాప్తించినది అకాల మరణమైనందున, తిరిగి ఉత్తమ జన్మ ఎత్తి నీ ఆయుశ్శేషం భూలోకంలో హాయిగా గడిపి తిరిగి వచ్చె సెయ్యి. అప్పుడు నీకు దివ్యలోక ప్రాప్తి కలుగుతుంది," అన్నాడు.

అది విని ఆమె, "దేవా, నేను ఏ జన్మ ఎత్తినప్పటికీ పూర్వ జన్మస్మృతి ఉండే లాగు అనుగ్రహించండి," అన్నది. దేవేం ద్రుడు సరే నన్నాడు.





త్వరలోనే ఆమె అవంతి రాజైన వీర సేన మహారాజుకు కుమార్తెగా జన్మించింది. ఆమెకు రత్నావళి అని పేరు పెట్టుకున్నారు. ఆమె అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతూ, పెరిగి పెద్దదయింది. ఆమెకు యుక్త వయస్సు రాగానే, సారణ దేశపు యువ రాజైన వీరసింహుడి కిచ్చి పెళ్ళి చేశారు.

కొద్ది సంవత్సరాల అనంతరం సారణ దేశానికి కరువు వచ్చింది. రాజుగారు కరువు నివారణ చేసే ప్రయత్నాలు ప్రారంభించాడు. బావులూ, చెరువులూ తవ్వించాడు, యజ్ఞాలూ, యాగాలూ చేయించాడు. అన్న దానాలు జరిపించాడు.



ఈ ప్రయత్నాలలో రాచనగరు వెలపల ఒక బ్రహ్మాండమైన చెరువు తవ్వే పని ఒకటి కొనసాగుతున్నది. ఒక నాటి సాయం కాలం వీరసింహుడు తన భార్య అయిన రత్నావళిని వెంట బెట్టుకుని చెరువు తవ్వే చోటికి విహారార్థం వెళ్ళాడు.

చెరువు తవ్వటం పూర్తి అయింది. చెరువు లోకి పూటుగా నీరు కూడా వచ్చింది. అనేక వందల పని వాళ్ళు చెరువు చుట్టూతా గట్ల మీద పని చేస్తున్నారు.

ఆ దృశ్యమంతా చూస్తున్న రత్నావళి కళ్ళు ఒక పెద్ద బండరాయి కేసి తిరిగాయి. ఆ బండరాతిని అయిదుగురు మనుషులు విశ్వ ప్రయత్నంతో కదిలిస్తున్నారు. వారిలో ఒకడు వృద్ధుడు, మిగిలిన వాళ్ళు నడికారు వాళ్ళు. అందరి శరీరాల పైనా చెమటలు దిగ గారుతున్నాయి, అందరూ ఆయాసంతో రొప్పుతున్నారు.

రత్నావళి వాళ్ళను చూస్తూనే గుర్తించింది. ఆ ముసలివాడు పూర్వ జన్మలో తన భర్త, మిగిలిన నలుగురూ తన కొడుకులు. వారినీ, నీచమైన వారి స్థితినీ, వారు పడుతున్న యాతననూ చూసి ఆమెకు గుండె బద్దలైపోయింది. "అయ్యో!" అని ఒక్క కేక పెట్టి ఆమె విరుచుకుని పడి



పోయింది. ఆ క్షణంలోనే ఆమె ప్రాణాలు పోయాయి. ఆమె భర్తా, పరివారమూ ఆమె అకస్మిక మరణానికి ఎంతో బాధ పడ్డారు. అలా జరగటానికి కారణ మేమిటో వారికి అంతు చిక్కలేదు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, రత్నావళికి పూర్వ జన్మస్మృతి ఉండటం చేతనే కదా, తాను రాణిగా పుట్టి కూడా తన పూర్వ భర్తనూ, కొడుకులనూ చూసి పరితపించి ప్రాణాలు విడిచింది? అస లామె దేవేంద్రుణ్ణి పూర్వ జన్మస్మృతి ఉండాలని ఎందు కడిగింది? అందువల్ల ఆమెకు నష్టమే గాని లాభం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చండాలుడి భార్య తన జన్మ గురించి ఎన్నడూ రోత చెందినట్టు కనబడదు. ఆమె తనకా జన్మలో కలిగిన కష్టా లన్నిటినీ సహించింది. అంత నికృష్టమైన జన్మ ఎత్తి కూడా ఉత్తమ లోకాలు పొంద గలిగేటంత పుణ్యం సంపాదించుకున్నది. దేవేంద్రుడు తన కింకా ఆయుశ్శేషం ఉన్నదనీ, అది తీరగలందులకు తాను సుఖ మయమైన జన్మ ఎత్త వలసి ఉంటుందనీ అన్నప్పు డామెకు ఆ జన్మ పై వ్యామోహం కలగలేదు; తాను వెనక ఎత్తిన జన్మకంటె అది మంచిది కాకపోవచ్చు నన్న భయంతోనే ఆమె పూర్వ జన్మస్మృతి కోరింది. పూర్వ జన్మలో ఆమెది జాలి గుండె. రత్నావళిగా ఉన్నప్పటికీ ఆమె నా జాలి వదలలేదు. మరొక సంగతి ఏమంటే, ఆమె మరణానికి అసలు కారణం ఆయుశ్శేషం తీరిపోవటమే గాని, తన పూర్వ భర్తా, కొడుకులూ కష్టపడటం చూసి, ఆమె జాలిపడటం కాదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# రాజనీతి

ఒకనాడు యశవంత దేశపు రాజుగారు కొలువుతీరి ఉండగా, రాజ భటు లొక బలిష్ఠుడైన యువకుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి రాజుగారి సమక్షానికి తెచ్చి నిలబెట్టారు. ఆ యువకుడి వెనకాలే, పెద్దగా దుఃఖిస్తూ ఒక యువతి వచ్చింది.

రాజుగారు భటులతో, "ఎవడీ మనిషి? ఎందు కితన్ని బంధించి తెచ్చారు? ఆ స్త్రీ ఎందు కలా ఏడుస్తున్నది?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు ఏడ్చే యువతి ఇలా జవాబు చెప్పింది: "మహారాజా, వీడు మానవత్వం లేని రాక్షసుడు, హంతకుడు. నా తల్లిని నిష్కారణంగా చంపేశాడు. నిన్న రాత్రి వర్షం కురుస్తున్న సమయంలో వీడు తడుస్తూ మా యింటిపక్కగా వెళ్ళుతూం డటం చూసి, మా అమ్మ జాలిపడి, వాణ్ణి లోపలికి రమ్మని, మా ఇంటి ముందు వసారాలో కూర్చోమన్నది. వా డీ దేశం వాడు కాదనీ, నగరంలో బంధువులు గాని, ఎరిగిన వాళ్ళు గాని లేరనీ తెలిసి మా అమ్మ వీడికి నిన్న రాత్రి కడుపునిండా తిండి పెట్టి, పడుకునే టందుకు మంచం ఇచ్చి అతిథిలాగా సత్కరించింది. మా అమ్మకు ఉబ్బసం జబ్బున్నది. వాన వల్ల అది జాస్తి అయి ఆవిడ ఖళ్ళు ఖళ్ళున దగ్గ నారంభించింది. తన నిద్రకు ఆవిడ దగ్గు భంగం కలిగిస్తున్న దని వీడు మా అమ్మ పైన మండి పడుతూ, ఆమెను నానా తిట్లూ తిట్టుతూ, తన కత్తి తీసి ఆమె మెడ తెగవేశాడు. నేను మతి పోయి కేకలు పెట్టేసరికి ఇరుగు పొరుగు జనం వచ్చి వీణ్ణి పట్టుకుని బంధించి భటులకు పట్టి ఇచ్చారు."

ఈ మాట చెప్పి ఆ యువతి మళ్ళీ దుఃఖంతో కుళ్ళసాగింది.

వి. సుజనప్రభ






రాజుగారు వాడి కేసి నిప్పులు కక్కుతూ చూసి, "ఏమిరా, నీచుడా? నీకు అన్నం పెట్టిన మనిషిని అంత స్వల్ప కారణానికి చంపుతావా?" అన్నాడు.

హంతకుడిలో పశ్చాత్తాపం గాని, భయం గాని, రాజుగారంటే లక్ష్యం గాని ఏమీ కనిపించలేదు.

"ముసలి ముండ తినటాని కింత రొట్టె ఇస్తేమటుకు నన్ను నిద్ర పోనివ్వకుండా అదే దగ్గటమా? అప్పటికీ రెండు సార్లు చెప్పి చూశాను; నా నిద్ర చెడగొట్టుతున్నావు, దగ్గకు అన్నాను. వినక ఒకే తీరున దగ్గింది. నాకు ఒళ్ళు మండి చంపేశాను. ఆ తరవాత సుఖంగా నిద్రపోయాను," అన్నాడు వాడు.

వాడు చేసిన హత్య కన్న కూడా వాడి నిర్లక్ష్యం సభలో అందరికీ ఆగ్రహం తెప్పించింది. రాజుగారు భటులతో, "వీడు మనిషి కాదు; ఒక విధమైన అడవి జంతువు. వీణ్ణి తీసుకుపోయి వెంటనే శిరశ్ఛేదం చెయ్యండి," అన్నాడు,

వెంటనే మంత్రి లేచి, "మహారాజా, ఒక్క మనవి. వీణ్ణి చంప వద్దు. ప్రాణాలతో నా కిచ్చెయ్యండి," అన్నాడు.

ఈ మాటకు రాజు ఆశ్చర్యపడ్డాడు, సభికులూ ఆశ్చర్యపడ్డారు. మంత్రి ఇలా అనటంలో ఉద్దేశ మేమిటో ఎవరికీ అర్థం కాలేదు. కాని ఆయన రాజనీతిలో ఆరితేరినవాడు, ఏదో కారణం లేకుండా ఈ కోరిక కోరడు. అందుచేత రాజుగారు, "మంచిది. వీణ్ణి మీ పరం చేస్తాను. అయితే వీడు తప్పించుకు పోకుండా చూసే భారం మీదే!" అన్నాడు.

మంత్రి ఆ హంతకుడి కోసం ఒక విశాలమైన ఖైదు ఏర్పాటుచేసి, దానికి తగిన కాపలా పెట్టించాడు. వాడు తిండి పుష్టిగల వాడు. తిండీ, వ్యాయామమూ ఉంటే వాడి కింకేమీ అవసరం లేదు. ఈ రెంటికీ తగిన

ఏర్పాట్లు మంత్రిగారు చేయించాడు. తల్లిని కోల్పోయిన యువతికి మంచి వరుణ్ణి చూసి పెళ్ళి చేశాడు.

కొద్ది మాసాలు గడిచాయి. వాడు మదించిన అడవి దున్నలాగా తయారయాడు. వాడు అస్తమానమూ మల్లచరుస్తూ, తొడలు కొట్టుతూ, కాపలావాళ్ళను కుస్తీకి రమ్మని కవ్విస్తూండేవాడు.

యశవంత దేశాని కొక పొరుగు దేశంతో యుద్ధం వచ్చింది. సైనిక బలాలన్నీ అటు వేపు వెళ్ళాయి. ఆ సమయంలో రెండవ వైపున ఉన్న సుల్తా నొకడు తన సైన్యాన్ని తీసుకుని యశవంత రాజధాని పైకి వచ్చి, కోట వెలపల గుడారాలు వేసి విడిశాడు. ఈ విధంగా రాజ్యానికి అనుకోని ఉపద్రవం వచ్చిపడింది.

అప్పుడు మంత్రికి తన ఖైదీతో పని వచ్చింది. ఆయన తన ఎత్తుగడ రాజుగారికి వివరించి, దండెత్తి వచ్చిన సుల్తాను కొక ఉత్తరం రాసి, దాని పైన రాజుగారి చేత ముద్ర వేయించాడు. తరవాత ఆయన తన అధీనంలో ఉన్న ఖైదీని పిలిపించి, "మన దేశాని కొక సుల్తాను వచ్చి నగరం బయట గుడారంలో ఉన్నాడు. రాజుగారి దూతగా నువ్వా సుల్తాను వద్దకు వెళ్ళి, ఈ ఉత్తరం



ఇచ్చి సుల్తానుగారి సమాధానం తీసుకు రావాలి. ఈ పని చెయ్యగలవా, లేక భయ పడతావా?" అన్నాడు.

"నాకు భయమా?" అంటూ ఆ హంతకుడు మంత్రి ఇచ్చిన చీటీ తీసుకుని, ఇద్దరు సైనికులను వెంట బెట్టుకుని శత్రువుల గుడారాల వద్దకు వెళ్ళాడు.

యశవంతరాజు వద్ద నుంచి దూత వచ్చాడని విని సుల్తాను, ఇది సంధి రాయబారమే ననుకుని తన వజీరునూ, సేనాధిపతినీ కూడా తన వద్దకు పిలిపించుకుని దూతను తన వద్దకు తీసుకు రావచ్చునని తన భటులతో చెప్పాడు.

దూత యొక్క దర్పమూ, ధైర్యమూ చూసి సుల్తాను, వా డొక పెద్ద రాజోద్యోగి అయి ఉంటాడనుకున్నాడు. వాడు గుడారంలో ఆసీనులై ఉన్న ముగ్గురినీ చూసి, "మీలో సుల్తాను ఎవరు?" అన్నాడు.

"నేనే. ఏమిటి నువు తెచ్చిన సందేశం?" అన్నాడు సుల్తాను.

దూత మంత్రి ఇయ్యమన్న లేఖను సుల్తాను చేతికి ఇచ్చాడు. సుల్తాను దాన్ని విప్పి చదువుకుని కోపంతో వణికిపోయి, కళ్ళ నిప్పులు రాల్చాడు. ఆ ఉత్తరం నిండా సుల్తానుకు తిట్లూ, శాపనార్థాలూ మాత్రమే ఉన్నాయి. సుల్తానా ఉత్తరాన్ని తన వజీరుకూ, సేనాపతికీ చూపించాడు. వారా వుత్తరం చదివి, పట్టరాని ఆగ్రహంతో దూత కేసి చూశారు.

"ఎంత సేపు నన్నిక్కడ నిలబెడతారు? ఏమిటి మీ సమాధానం?" అన్నాడు దూత పళ్ళుకొరుకుతూ.

"నా సమాధానం ఇదుగో," అంటూ సుల్తాను వాణ్ణి కాలెత్తి తన్నాడు. వెంటనే దూత కత్తి దూసి సుల్తాను తల తెగనరికాడు. మరుక్షణం వాడి మీదికి వెళ్ళిన వజీరు, సేనాపతుల తలలు కూడా తెగిపోయాయి. సుల్తాను అంగరక్షకులు హంతకుణ్ణి చుట్టుముట్టారు. అందులో కూడా కొందరు చచ్చినాకనే మిగిలినవాళ్ళు వాణ్ణి చంపగలిగారు.

కొద్ది క్షణాల లోపల సుల్తానూ, వజీరూ, సేనాపతీ చచ్చేసరికి సేనలను నడిపించే వాడూ, యుద్ధం జరిపించే వాళ్ళూ లేక సుల్తాను సేన తమ దేశానికి తిరిగి వెళ్ళిపోవలిసి వచ్చింది. యశవంత దేశానికి ఒక గొప్ప ప్రమాదం తప్పటమేకాకుండా ద్రోహ బుద్ధి గల ఒక పరిసర రాజు కూడా లేకుండా పోయాడు.

రాజు మంత్రి రాజనీతిజ్ఞతను బహిరంగంగా మెచ్చుకుని, ఆయనకు అంతులేని కానుక లర్పించాడు.





# పూలు పూయించేవాడు

ఒక గ్రామంలో ఒక ముసలివాడూ, అతని భార్యా ఉండేవాళ్ళు. వాళ్ళు చాలా పేదవాళ్ళు. ఏడాది పొడుగునా ముసలివాడు ఎంతో శ్రమపడితే గాని వారికి గడిచేది కాదు. ఎందుచేతనంటే వాళ్ళకు పిల్లలు లేరు. వారొక కుక్కను పెంచుతూ, దాన్నే ఎంతో ప్రేమగా చూసుకునేవారు.

ఒకరోజు సాయంకాలం ముసలివాడు తన పని ముగించి, సూర్యాస్తమయం వేళ అడివి కేసి షికారుగా బయలుదేరాడు. అతని వెంట అతని భార్యా, కుక్కా కూడా బయలుదేరారు. వారు చెట్ల మధ్యగా కాలి బాటను పట్టి పోతూండగా ఒక చోట కుక్క ఆగి, నేల వాసన చూసి, గట్టిగా రెండుసార్లు అరిచి, కాళ్ళతో మట్టి తవ్వసాగింది.

భార్యా భర్త లిద్దరూ సమీపానికి వచ్చి చూసే సరికి కుక్క తవ్విన గుంటలో కొన్ని బంగారు నాణాలు కనిపించాయి. వాళ్ళు ఆ గుంటను తమ చేతులతో పెద్దది చేసే సరికి మరి కొన్ని బంగారు నాణాలు దొరికాయి. మట్టి వదులుగానే ఉండటంచేత వాళ్ళు త్వరలోనే అక్కడ పాతి ఉన్న బంగారు నాణాలన్నీ తీసుకుని, గుడ్డలో మూట గట్టుకుని, తమ దారిద్ర్యాన్ని ఒక్కసారిగా తీర్చిన తమ కుక్కను మెచ్చుకుంటూ ఇంటికి తిరిగి వచ్చేశారు.

బంగారం దొరికిన తరవాత ముసలివాడు గ్రామంలోని బీదవాళ్ళ ఇళ్ళన్నిటికీ వెళ్ళటమూ, వారికి అవసరమైన ధన సహాయం చెయ్యటమూ చేస్తూ వచ్చాడు. అతను వెళ్ళిన చోటికల్లా కుక్క కూడా వెళ్ళేది.

ముసలివాడు తన దగ్గిర ఉన్న డబ్బుతో బీద రైతుల పొలాలు కొని, వారికి మంచి వెల ఇచ్చి, ఆ పొలాలను వారినే చేసుకో

కె. రామారావు



నిచ్చాడు. ఇందువల్ల వాళ్ళకు చాలా సహాయమయింది.

ఈ ముసలి దంపతుల పొరుగున ఒక దుష్టు డుండేవాడు. అతను నీచుడూ, క్రూరుడూ కావటం చేత ఊళ్ళో ఎవరూ అతనితో స్నేహంగా ఉండేవాళ్ళు కారు.

ఒకనాడు ముసలివా డింట లేని సమయంలో వాడు ముసలిదాన్ని చూడ వచ్చి, ఇచ్చకాల కబుర్లేవో చెబుతూ, కుక్కను దువ్వుతూ, "మీరు కుక్కను ఇప్పుడు షికార్లకు తిప్పటంలేదు. దీన్ని నేను షికారుకు తీసుకుపోయి తెచ్చి ఇస్తాను, నా వెంట పంపుతారా?" అన్నాడు.

ముసలావిడ ఈ మాటల కెంతో సంతోషించి కుక్కనా దుష్టుడి కిచ్చింది. ముసలివాడు ఇంటికి వచ్చి జరిగినది విని, తాను కూడా సంతోషించాడు. అయితే రాత్రి పొద్దు పోయినాకూడా పొరుగువాడు కుక్కను తెచ్చి అప్పగించక పోయేసరికి భార్యా భర్తలు ఆందోళన చెందారు.

చివరకు ముసలివాడు పొరుగింటికి వెళ్ళి తలుపు తట్టాడు.

"ఎవరది? వేళా పాళా లేదూ?" అని రుసరుస లాడుతూ దుష్టుడు తలుపు తెరిచి ముసలివాణ్ణి చూసి, "కుక్క కోసం వచ్చావా? కుక్కా లేదు, గిక్కా లేదు. అది చచ్చింది," అన్నాడు.

"చచ్చిందా?" అన్నాడు ముసలివాడు కంగారుగా.

"అవును, చచ్చింది. నీ కుక్కను నేను మోజుపడి తీసుకు పోలేదు. నాక్కూడా నిధి చూపిస్తుందేమో ననుకున్నాను. ఎంతో సేపు దాన్ని తిప్పగా, తిప్పగా ఒక చోట కాళ్ళతో మట్టి గీరింది. ఎంతో ఆశతో నేను కూడా మట్టి తవ్వి చూతునుగదా, కంకరరాళ్ళూ బొగ్గులూ దొరికాయి. నీ వెధవ కుక్కను అక్కడే చంపి, ఆ గోతిలోనే పడేసి చక్కా వచ్చాను," అన్నాడు దుష్టుడు.

ఆ రాత్రి ముసలిదంపతు లిద్దరూ తమ ప్రియమైన కుక్క కోసం శోకించారు. మర్నాడు ఉదయం ముసలివాడు బయటికి వెళ్ళి, కుక్క కళేబరాన్ని తెచ్చి, తమ దొడ్లో ఉన్న నేరేడుచెట్టు మొదట్లో గొయ్యి తవ్వి, దాన్ని అందులో పూడ్చి పెట్టాడు.

కొద్ది నెలలు గడిచాయి. తమ దొడ్లో ఉన్న నేరేడుచెట్టు విపరీతంగా పెరిగి పోవటం ముసలి దంపతులు గమనించారు. దాని మాను మూడింతలు లావయింది. దాని కొమ్మ ఒకటి ఇంటి మీదికి పెరిగింది. గట్టి గాలి కొట్టితే ఆ కొమ్మ విరిగి ఇంటి పైన పడుతుందని వాళ్ళకు భయంవేసింది.

ముసలివాడు ఆ కొమ్మను కొట్టేసి, దాని నుంచి ఒక కుంది తయారు చేశాడు. అది పిండి దంచుకోవటానికి పనికి వస్తుందని భార్యా భర్త లనుకున్నారు.

ఆ యేడు వరిపంట సరిగా పండలేదు. ప్రజలు ధాన్యానికి కటకట పడుతున్నారు. ముసలివాడు ఎప్పటిలాగే గ్రామంలోని పేదలకు ధన సహాయం చేస్తున్నాడు గాని వారి ఆకలి బాధను తగ్గించటం అతడి వల్ల కావటం లేదు. తమ కున్న బియ్యంలో చాలా భాగం ఊళ్ళో పంచటం చేత ఆ దంపతులకే బియ్యం కొరత వచ్చింది. ఉన్న దాన్ని చాలా పొదుపుగా వాడుకుంటున్నారు.





కొయ్య కుండి తయారు కాగానే ముసలిది గుప్పెడంటే గుప్పెడు బియ్యం కుండిలో పోసి దంచ నారంభించింది. ముసలివాడు వచ్చి చూసేసరికి పిండి కుండి నిండా ఉన్నది. "అయ్యో, అన్ని బియ్యం ఎందుకు పిండి చేస్తున్నావు?" అన్నాడు భర్త.

"గుప్పెడే వేశాను," అన్నది భార్య.

ఆమె దంచుకు పోతున్న కొద్దీ కుండిలో పిండి ఊరుకొస్తున్నది. దాన్ని తోడేసి మళ్ళీ దంచితే మళ్ళీ కుండి నిండింది. భార్యా భర్త లిద్దరూ వంతులు వేసుకుని తెల్లవార్లూ పిండి దంచారు. మర్నా డుదయం ముసలి వాడా పిండిని ఊళ్ళో ఉండే యోగ్యు

లందరికీ పంచిపెట్టి వచ్చాడు. ఆ శీతాకాలం వెళ్ళిన దాకా ఆ గ్రామంలో ఎవరూ తిండికి మాడ నవసరం లేకుండా పోయింది.

ఒకనాడు పొరుగింటి దుష్టుడు తిండి కోసం యాచించ వచ్చాడు.

"మీ కుండి అక్షయ పాత్ర అని చెప్పు కుంటున్నారు. మీ కుక్కను పూడ్చి పెట్టిన చెట్టు నుంచే ఆ కుండి తయారు చేశారట. ఆ కుక్క చచ్చి కూడా మిమ్మల్ని కాపాడు తున్నదన్న మాట. దాన్ని నేను బుద్ధి తక్కువై చంపాను. ఆకలితో చస్తున్నాను," అన్నాడు దుష్టుడు.

"కుండిలో పిండి దంచి ఇస్తానుండు," అన్నది దయగల ఆ ముసలి ఇల్లాలు.

"నీకు శ్రమ ఇవ్వలేను, తల్లీ. ఒక్క రోజు మీ కుండిని నా కిస్తే నేనే పిండి దంచుకుంటాను," అన్నాడు దుష్టుడు.

భార్యా భర్తలు దుష్టుడికి తమ కుండిని కాస్తా ఇచ్చేశారు.

ఆ సాయంకాలం ముసలివాడు తన కుండిని తెచ్చుకోవటానికి వెళ్ళేసరికి, దుష్టుడు తన ఇంటి ముందు ఏవో కర్ర ముక్కలను కాల్చుతున్నాడు.

"చలిమంట వేసుకునేటందు కిదా సమయం?" అని ముసలివా డన్నాడు.

"చలి మంట కాదు. నీ దిక్కుమాలిన కుందిని కాల్చి బూడిద చేస్తున్నాను. నా దగ్గిర ఉన్న నాలుగు గింజలూ అందులో వేసి దంచితే పిండి రాకపోగా గులకరాళ్ళు వచ్చాయి!" అన్నాడు దుష్టుడు.

ముసలివాడికి దుర్భరమైన వేదన కలిగింది. ఆ దుష్టుడు తనకే గాక, గ్రామంలోని పేదలందరికీ తిండి లేకుండా చేశాడు. తన కుక్కకు మరొక సారి ద్రోహం చేశాడు. అతను కుంది కాలిన బూడిద కొంత తన బట్టలో కట్టుకుని ఇంటికి వెళ్ళాడు. తన కుక్క జ్ఞాపకం నిమిత్తం అతను కొద్ది బూడిదను నేరేడుచెట్టు మొదట్లో కుక్కను పాతిన చోట చల్లాడు. వెంటనే ఆ చెట్టుకు పూత పడింది.

ఈ సంగతి ముసలావిడ గమనించి భర్తతో చెప్పింది. నేరేడుచెట్టు పుయ్యటానికి కారణం బూడిదే అయి ఉంటుందనుకుని, ముసలివాడు కొద్ది బూడిద తీసుకుని తన దొడ్లో ఉన్న మల్లెలు మొదలైన పూల మొక్కల మీద చల్లాడు. అది నడి శీతాకాలమైనప్పటికీ ఆ మొక్కలన్నీ విరగ బూశాయి. ఈ సంగతి ఊరంతా పాక్కిపోయింది. దొడ్లలో పూల మొక్కలున్న వారందరూ ముసలివాడి సహాయంతో తమ మొక్కలకు పూలు పూయించుకున్నారు.





"పూలు పూయించేవాడు" అన్న మాట చాలా దూరం పాకింది. సమీపంలో ఉన్న జమీందా రొకాయన రెండేళ్ళ క్రితం తన భవనం చుట్టూ పూల తోట వేయించాడు. ఏ కారణం చేతనో ఒక్క చెట్టూ పుయ్యలేదు. ముసలివాడి మాట చెవిన పడగానే ఆ జమీందారు అతన్ని పిలిపించి, "నా పూల తోట పూయిస్తే అడిగినంత బహుమానం ఇస్తాను," అన్నాడు.

ముసలివాడు తన ఇంటి నుంచి కొంత బూడిద తెచ్చి తోట అంతటా చల్లేసరికి తోటంతా నందనవనం లాగా అయింది.

వసంత కాలం రాకుండానే పూలతోట అలా విరగ బూయటం ఎవరూ ఎన్నడూ విని ఉండలేదు. జమీందారుగారు ముసలి వాడికి రకరకాల బహుమతు లిచ్చి పంపేశాడు.

ముసలివాడి కీర్తి చూసి పొరుగున ఉన్న దుష్టుడు సహించలేక పోయాడు. వాడు పని పెట్టుకుని మర్నాడు జమీందారుగారి దగ్గిరికి ఇంత బూడిద తీసుకుపోయి, "మీరా ముసలివాణ్ణి తెగ మెచ్చుకున్నారుట. అసలు వాడికా బూడిద ఇచ్చిందే నేను. విద్య నాదీ, పేరు వాడిదీ అయింది. నన్ను నియోగించారంటే ఈ తోటను ఇంతకు పదింతలు పూయించగలను," అన్నాడు.

"అలాగా? ఈ సంగతి నాకు తెలీదు. తోటను మరింత బాగా పూయించావంటే నీకూ్కడా మంచి బహుమాన మిస్తాను," అన్నాడు జమీందారు.

దుష్టుడు తాను తెచ్చిన బూడిదను పూలమొక్కల మీదా, చెట్ల మీదా కూడా చల్లుకుంటూ వెళ్ళాడు. వాడు అన్ని మొక్కల మీదా బూడిద చల్లటం పూర్తి చేసి కలయజూసేసరికి తోటలోని ప్రతి మొక్కా, ప్రతి చెట్టూ చచ్చి ఉన్నది.

జమీందారుకు మండిపోయింది. ఆయన తన నౌకర్ల చేత దుష్టుణ్ణి సున్నంలోకి ఎముక లేకుండా తన్నించి పంపేశాడు.





# అశోకదత్త విజయదత్తులు

ఒకప్పుడు కాళిందీ తీరాన ఒక అగ్రహారంలో గోవిందస్వామి అనే సద్బ్రాహ్మణుడుండే వాడు. ఆయనకు అశోకదత్తు డనీ, విజయదత్తు డనీ ఇద్దరు కొడుకులుండేవారు.

ఒకసారి ఆ ప్రాంతాల తీవ్రమైన కరువు వచ్చింది. గోవిందస్వామి కైతే తినటానికున్నది, ఇంకొకరికి పెట్టటానికీ ఉన్నది. అయితే తన బంధువులూ, మిత్రులూ కరువు వాతపడి చస్తుంటే ఆయనకు చాలా బాధ కలిగింది. సహాయం ఎంతమంది కని చెయ్యగలడు? అందుచేత ఆయన తనకున్నదంతా అయిన వారి కిచ్చేసి, భార్యా పుత్రులతో కాశీనగరంలో కాపరం ఉండటానికి బయలు దేరాడు.

వారందరూ కాశీనగరం వెలపల ఉన్న చండికాలయం చేరారు. గోవిందస్వామి పగలల్లా అక్కడే ఉండి దేవీ పూజ చేసి, ఆ సాయంకాలం ఊరి వెలపలనే ఒక చెట్టు కింద సకుటుంబంగా విశ్రమించాడు. ఆయనలాగే ఇంకా అనేకమంది బాటసారులు అక్కడి చెట్ల కింద చేరారు. రాత్రి కాగానే ఆకులూ అలములూ పరిచి బాటసారు లందరూ, ప్రయాణపు బడలిక చేత వెంటనే నిద్రపోయారు.

ఒకరాత్రి వేళ గోవిందస్వామి చిన్న కొడుకు విజయదత్తుడు చలిజ్వరంతో వణకసాగాడు. వాడు చలిబాధ భరించలేక తండ్రిని లేపి, "నాన్నా, చలితో చచ్చిపోతున్నాను. చితుకులు తెచ్చి మంట వేస్తావా?" అని అడిగాడు.

"చితుకులు తెస్తే మాత్రం, నిప్పేదిరా, బాబూ?" అన్నాడు తండ్రి.

"అదుగో ఆ కనిపించే మంట ఏమిటి, నాన్నా?" అని కొడుకు అడిగాడు.

"అది వల్లకాడు. శవం తగలబడుతున్నది," అన్నాడు తండ్రి.







"నన్ను అక్కడికి తీసుకుపో, నాన్నా. చలి కాచుకుంటాను," అన్నాడు కొడుకు.

"అక్కడ పిశాచా లుంటాయిరా!" అన్నాడు తండ్రి.

"పిశాచాలు నన్నేం చేస్తాయిలే, నాన్నా. తీసుకుపో," అన్నాడు విజయదత్తుడు.

చేసేది లేక గోవిందస్వామి కుర్రవాణ్ణి చితి దగ్గిరికి తీసుకుపోయాడు. త్వరలోనే కుర్రవాడికి చలిబాధ తీరింది.

వాడు తండ్రికి మంటల మధ్య గుండ్రగా కనిపించేది చూపుతూ, "అదేమిటి, నాన్నా?" అని అడిగాడు. "అది మనిషి పుర్రె," అన్నాడు తండ్రి.



విజయదత్తుడు సాహసంతో మండే కట్టె నొకటి తీసి దానితో మండే పుర్రె మీద ఒక్క దెబ్బ వేశాడు. అది పగిలి దానిలో నుంచి ఏదో ద్రవం చిమ్మి కుర్రవాడి ముఖాన పడింది.

వెంటనే కుర్రాడి రూపం మారిపోయి ఒక భయంకర రాక్షసాకారం వచ్చింది. జుట్టు పైకి లేచి ఉన్నది, చేతిలో కత్తి ఉన్నది, నోటిలో కోరలున్నాయి. ఆ రాక్షసుడు కత్తి ఎత్తి గోవిందస్వామిని నరకపోయేటంతలో, "కపాలస్ఫోటా, చంపకు, చంపకు! ఆయన నీ తండ్రి. ఇలా వచ్చెయ్యి!" అనే కేక వినిపించింది. మరుక్షణం ఆ రాక్షసు డంతర్ధాన మయాడు.

గోవిందస్వామి, "అయ్యో, తండ్రీ! విజయదత్తా! ఏమైపోయావురా?" అని ఏడుస్తూ చెట్టు కిందికి తిరిగి వెళ్ళి, తెల్లవారగానే తన భార్యకూ, పెద్ద కొడుకూ జరిగిన సంగతంతా చెప్పాడు. అందరూ విజయదత్తుడి కోసం ఒక శోకం పెట్టారు.

ఈ వార్త మిగిలిన బాటసారులకు కూడా తెలిసింది. వాళ్ళు గోవిందస్వామి కుటుంబాన్ని పరామర్శించారు. వారిలో సముద్రదత్తుడనే వర్తకు డొకడున్నాడు. ఆయన గోవిందస్వామి కుటుంబాన్ని ఆదుకుని, కాశీ





నగరంలో ఉన్న తన యింటికి వారిని తీసుకు పోయి, వారి కక్కడే శాశ్వతంగా బస ఏర్పాటు చేశాడు.

2

ఏళ్ళు గడిచాయి. గోవిందస్వామి పెద్ద కొడుకు ఇతర విద్యలతోబాటు సాము విద్యలో ఉత్తీర్ణుడై, యౌవనవంతుడయాడు. అతని బలం అసాధారణమైనది.

ఒకసారి ఉత్సవం వచ్చింది. కాశీ రాజైన ప్రతాపముకుటుడు నానా దేశాల నుంచి మల్లులను పిలిపించి, వారి మధ్య యుద్ధాలు ఏర్పాటు చేయించాడు. దక్షిణ దేశం నుంచి వచ్చిన మల్లు డొకడు మిగిలిన మల్లుల నందరినీ ఓడించాడు. అప్పుడు సముద్ర దత్తుడు రాజుతో తన ఇంట ఒక బలాఢ్యు డైన కుర్రవా డున్నాడనీ, వా డీ దక్షిణ దేశపు మల్లుణ్ణి ఓడించగలడనీ చెప్పాడు. రాజు అశోకదత్తుణ్ణి పిలిపించి, దక్షిణదేశపు మల్లుడితో యుద్ధం ఏర్పాటు చేయించాడు. అశోకదత్తుడా మల్లుణ్ణి ఓడించాడు. ప్రేక్షకులు గగ్గోలుగా హర్షధ్వానాలు చేశారు.

రాజు అశోకదత్తుణ్ణీ, అతని పరాక్రమాన్నీ మెచ్చుకుని, అతనికి రత్నాల రాశి బహూకరించి, తన అంగరక్షకుడుగా నియమించాడు.




కొంత కాలం గడిచింది. ఒక నాటి రాత్రి రాజు సపరివారంగా ఎక్కడికో వెళ్ళి శ్మశానం పక్కనున్న దారి వెంట తిరిగి వస్తూండగా, "దాహం, దాహం!" అని ఎవరో కొరతపడిన మనిషి ఆక్రోశించటం వినపడింది.

రాజు జాలిపడి, "ఎవరైనా ఆ మనిషికి నీరివ్వండి," అన్నాడు. కాని ఆ వేళప్పుడు శ్మశానంలో ప్రవేశించే ధైర్యం ఎవరికుంటుంది? అశోకదత్తుడే అందుకు సిద్ధపడ్డాడు. అతను నీటితో శ్మశానంలోకి ప్రవేశించగానే రాజు సపరివారంగా నగరానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.







"నాయనా, నేనీ మనిషి భార్యను. నా భర్త ప్రాణంపోతే అతనితోబాటు చితిలో పడి కాలిపోదామని చూస్తున్నాను. ఎంతకూ చావకుండా ఉన్నాడు. దాహం, దాహ మంటాడు. నీళ్ళు తెచ్చానుగాని, కొర్రు మరీ ఎత్తుగా ఉండటం చేత నోటికి అందించలేక పోయాను," అన్నదా స్త్రీ.

"ఇదుగో, నీరు తెచ్చాను. నా వీపు మీద ఎక్కి ఈ నీరు నీ భర్త నోటికి అందించు," అంటూ అశోకదత్తు డామెకు తాను తెచ్చిన నీరిచ్చి, వంగున్నాడు. ఆ స్త్రీ అతని వీపు పైన ఎక్కింది.

కొద్దిసేపటికి తనమీదా, నేలమీదా రక్తపు చుక్కలు రాలటం చూసి అశోకదత్తుడు తల ఎత్తి చూసేసరికి, ఆ స్త్రీ కత్తితో ఆ కొర్రు మీది మనిషి మాంసం కోస్తూ ఉండటం కనబడింది.

ఇదేదో పిశాచి అనుకుని, అతను ఆమెను నేలకువేసి కొట్టి చంపే ప్రయత్నంలో ఆమె పాదాన్ని పట్టుకున్నాడు. అంతలోనే ఆమె ఆకాశం కేసి దూసుకుపోయి అదృశ్య మయింది. అశోకదత్తుడి చేతికి ఆమె కాలి నూపురం మాత్రం చిక్కింది.

తనకు జరిగిన విచిత్రమైన అనుభవానికి ఆశ్చర్యపడుతూ, తనకు దొరికిన నూపురాన్ని

చీకటి రాత్రి. కాలే శవాల వెలుతురే వెలుతురు. అశోకదత్తుడు ఆ చీకటిలో తడువుకుంటూ ముందుకు పోతూ, "ఎవరు నీ రడిగింది?" అని గట్టిగా అడిగాడు. "నేనే," అని జవాబు వచ్చింది. అశోక దత్తుడా ధ్వని వినిపించిన దిక్కుగా వెళ్ళి, ఎదట కొరత వేసిన ఒక మగవాణ్ణీ, కింద పడి పొరలుతూ ఏడ్చే ఒక అందమైన స్త్రీనీ చూశాడు. ఆమె అపూర్వమైన ఆభరణాలం కారాలు చేసుకుని ఉన్నది.

"అమ్మా, ఎవరు నీవు? ఎందు కిక్కడ పడి ఏడుస్తున్నావు?" అని అడిగాడు అశోకదత్తుడు.







ఇంతకన్న మంచి భర్త దొరుకుతాడంటావా?" అన్నాడు. అప్పుడు రాణి అసలు సంగతి బయటపెట్టింది. రాజకుమార్తె అనంగలేఖ చాలా కాలంగా అశోకదత్తుణ్ణి ప్రేమించి, బాధపడి, చివరకు తల్లికి చెప్పింది. అది మొదలు రాణి ఈ సంగతి తన భర్తకు చెప్పే అవకాశం కోసం చూస్తున్నది. ఇంతలో రాజు ఆ మాట కాస్తా తన నోటనే అనేశాడు.

రాజుగారు ఈ సంగతి తెలిసి తృప్తిపడి, అశోకదత్తుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేసేశాడు.

తీసుకుని అతను ఇంటికి వెళ్ళిపోయి, మర్నాడుదయం స్నానం చేసి, రాజుగారి వద్దకు వెళ్ళి, ఆ నూపురాన్ని చూపి, జరిగిన దంతా చెప్పాడు.

రాజుకు అశోకదత్తుడి పైన అదివరకే ఉన్న సదభిప్రాయం మరింత అయింది. ఆయన అంతఃపురానికి వెళ్ళి, నూపురాన్ని రాణీకి ఇచ్చి, అది ఎలా వచ్చిందీ చెప్పాడు. ఇద్దరూ కలిసి అశోకదత్తుణ్ణి తెగ మెచ్చుకున్నారు. చివరకు రాజు, "ఈ అశోకదత్తుడు యువకుడు, మంచి కులంలో పుట్టినవాడు, అపార పరాక్రమ సంపన్నుడు, అందగాడు. మన అమ్మాయి అనంగలేఖకు

## 3

ఒకనాడు రాణీ తన భర్తకు అశోకదత్తుడు తెచ్చిన నూపురాన్ని చూపి, "ఇది ఒకటీ ఉంటే నిరుపయోగంగా ఉన్నది. దీనికి జత చేయించండి," అన్నది.

రాజు కంసాలులను పిలిపించి, వారికా నూపురం చూపి, దానికి జతగా మరొకటి చేయమని పురమాయించాడు. వారా నూపురాన్ని పరీక్షించి, "మహారాజా, ఈ పని తనం ఈ లోకానికి సంబంధించినది కాదు. ఇందులో అమర్చిన మణులు కూడా ఇక్కడ దొరికేవి కావు. ఇది ఎక్కడ దొరికిందో అక్కడే దీని జత కూడా దొరక వచ్చు. వెతికించండి," అన్నారు.



ఈ మాట విని రాజూ, రాణీ నీరుకారి పోయారు. వారి విచారం గమనించి అశోక దత్తుడు, "దీని జత కోసం నేనే ప్రయత్ని స్తాను," అన్నాడు.

అల్లుడు ఏదో సాహసం చేస్తాడని భయ పడి రాజు, "వద్దులే, నాయనా. ఇప్పుడు మునిగి పోయిందేముంది? దీనికి జత లేక పోతే పోయిందిలే!" అన్నాడు. కాని అశోక దత్తుడు వినిపించుకోలేదు.

ఆ నూపురం అతని కొక బహుళ చతుర్దశి నాటి రాత్రి వల్లకాట్లో ఒక చోట దొరికింది. అశోకదత్తుడు తిరిగి బహుళ చతుర్దశి నాటి రాత్రి అక్కడికే వెళ్ళాడు. ఆ స్త్రీ కనిపించ లేదు. ఆమెను పట్టుకోవటం కోసం అతను ఒక చెట్టున ఉరిపడి వేళ్ళాడే శవాన్ని తీసుకుని, "నరమాంసం! నరమాంసం!" అని కేకలు పెడుతూ శ్మశాన మంతటా తిరగసాగాడు.

ఎటు నుంచో ఒక ఆడది అతని దగ్గిరికి వచ్చి, "నా వెంటరా!" అన్నది. అతను ఆమె వెంట వెళ్ళాడు. ఒక మర్రి చెట్టు కింద ఒక దేవతా స్త్రీ లాటి మనిషి, దాసీల మధ్య కూర్చుని కనిపించింది. ఆమె అతన్ని చూసి, "నరమాంసం ఎంత కిస్తావు?" అని అడిగింది.



అశోకదత్తుడు తన వద్దనున్న నూపురం తీసి చూపుతూ, "ఇలాటి నూపురం ఇస్తే నరమాంస మిస్తాను," అన్నాడు.

ఆమె నవ్వి, "నా దగ్గిర అలాటి నూప రమే ఇంకొకటి ఉన్నది. నీ చేతి లోది నా కాలిదే. మారు రూపంలో ఉండటంచేత నన్ను గుర్తించలేక పోయావు. నాకు నర మాంసం వద్దు గాని, నేను చెప్పినట్టు చేస్తే రెండో నూపురం కూడా ఇస్తాను," అన్నది.

"చెప్పు. ఇప్పుడే చేస్తాను," అన్నాడు అశోకదత్తుడు.

"హిమాలయాలలో త్రిఘంట మనే పురం ఉన్నది. అక్కడ ఒక మహా వీరుడైన



69

రాక్షసు డుండేవాడు. నే నతని భార్యను. నా కొక కుమార్తె ఉన్నది. మా రాజైన కపాలస్ఫోటుడి పక్షాన యుద్ధం చేస్తూ నా భర్త మరణించాడు. తరవాత మా రాజు నాకా నగరాన్ని ఇచ్చేశాడు. నా కుమార్తెకు పెళ్ళి యీడు రాగానే తగిన వరుడి కోసం వెతకసాగాను. ఆ నాడు నిన్ను రాజు వెంట చూసి, నా కుమార్తెకు తగిన వరుడివని నిర్ణయించి, మాయచేత నిన్ను నీటితో శ్మశానం లోకి రప్పించాను. తిరిగి నిన్ను రప్పించే ఉద్దేశంతోనే నా నూపురం నీ చేతికి చిక్క నిచ్చాను. నే ననుకున్నట్టే తిరిగి వచ్చావు. మా ఇంటికి వచ్చి నా కుమార్తెను పెళ్లాడు," అన్నదామె.

మాట ఇచ్చినందుకు అశోకదత్తుడు ఆ రాక్షస స్త్రీ వెంట కామగమనాన త్రిఘంట పురానికి వెళ్ళాడు, విద్యుత్ప్రభ అనే రాక్షస కన్యను పెళ్ళాడాడు. అక్కడ అత్తగారింట కొద్ది రోజులుండి అతను తన అత్తతో, "నాకా రెండో నూపురం కూడా ఇచ్చెయ్యి. రాజుగారు నా కోసం కనిపెట్టుకుని ఉంటాడు," అన్నాడు. ఆమె అతనికి రెండో నూపురంతో బాటు ఒక బంగారపు తామర పుష్పాన్ని కూడా ఇచ్చింది.

తరవాత ఆమె అతన్ని కాశీనగరం వెలపల ఉన్న శ్మశానానికి చేర్చి, "నేను ప్రతి బహుళ చతుర్దశి రాత్రి ఇక్కడికి వస్తాను," అని చెప్పింది.





అశోకదత్తు డామె దగ్గిర శెలవు పుచ్చుకుని తన ఇంటికి వెళ్ళాడు. చిన్నవాడితో బాటు పెద్దవాడు కూడా పోయాడని ఏడుస్తున్న తల్లి దండ్రులను ఊరడించాడు. తన అల్లుడు తిరిగి వచ్చిన వార్త తెలిసి రాజు పరిగెత్తుకుంటూ అక్కడికి వచ్చాడు; తనకు నమస్కారం చేసిన అల్లుణ్ణి లేవనెత్తి గట్టిగా కౌగలించుకుని పరమానంద భరితుడయాడు.

తరవాత అశోకదత్తుడు రాజు వెంట రాజగృహానికి వెళ్ళాడు. తాను హిమాలయం నుంచి తెచ్చిన నూపురాల జతనూ, బంగారు తామర పువ్వునూ రాజుగారికి సమర్పించాడు. జరిగినదంతా విని రాజూ, రాణీ మొదలైనవారు అద్భుతం చెందారు. అల్లుడి గౌరవార్థం రాజు మేళ తాళాలతో గొప్ప ఉత్సవం జరిపించాడు.

రాజుగారు రెండు దేవాలయాలు కట్టించి, వాటికి వెండి కలశాలు ఏర్పాటుచేయించి ఉన్నాడు. అశోకదత్తుడు బంగారు తామర తెచ్చిన మరునాడు రాజుగారా తామరను ఒక దేవాలయం యొక్క కలశం పైన పెట్టించాడు. తెల్లని కలశం పైన ఎర్రని తామర చాలా అందంగా ఉన్నది.

“మరొక్క బంగారు తామర ఉంటే ఎంత బాగుండేది? రెండో కలశం మీద కూడా ఇలాగే పెట్టి ఉందుము గదా!” అన్నాడు రాజు.



"మహారాజా, అనుజ్ఞ ఇవ్వండి, మరొక బంగారు తామర తీసుకువస్తాను," అన్నాడు అశోకదత్తుడు.

రాజుకు గుండె గుభేలుమన్నది. "ఇంకా నయం! నా కింకో బంగారు తామర వద్దనే వద్దు," అన్నాడాయన.

కాని అశోకదత్తుడు వదిలిపెట్టలేదు. అతనికి మరో తామర తీసుకు రావాలని మహా ఉత్సాహంగా ఉన్నది. అతనా ఉత్సాహాన్ని ఎలానో అణచుకున్నాడు.

రోజులు గడిచాయి. తిరిగి బహుళ చతుర్దశి వచ్చింది. రాత్రి అయింది. అంతటా నల్లని కారు చీకట్లు కమ్మాయి.

అర్ధ రాత్రివేళ రాజకుమార్తె నిద్రలో మునిగి ఉన్న సమయంలో అశోకదత్తుడు చల్లగా ఇంటి నుంచి బయలుదేరి శ్మశానానికి వెళ్ళాడు.

అదే మర్రి చెట్టు కింద రాక్షసి అత్త వేచి ఉన్నది. అతన్ని చూస్తూనే ఆమె లేచి, తన మాయా ప్రభావం చేత అతన్ని తన వెంట బెట్టుకుని, హిమాలయ శిఖరాన ఉన్న తన నగరానికి తీసుకుపోయింది. అతను ఏమి పని మీద వచ్చాడో కూడా ఆమె అడిగి తెలుసుకోలేదు.

రాక్షసి కూతురు మాత్రం తన భర్త వచ్చినందుకు చాలా సంతోషించింది. అశోకదత్తు డక్కడ కొన్ని రోజులు తన రెండో భార్యతో సుఖంగా గడిపి, తన అత్తతో, "నా కింకో బంగారు తామర పుష్పం కావాలి," అన్నాడు.

"నా దగ్గిర మరొకటి ఎక్కడిది, నాయనా? ఉన్నదే ఒక్కటి. దాన్ని నీ కిచ్చేశాను. నా భర్త మీది అభిమానం కొద్దీ మా రాజైన కపాలస్ఫోటుడు ఆ ఒకటే ఇచ్చాడు. మా రాజుగారి కొక సరస్సున్నది. దాని నిండా ఇలాటి బంగారు తామర లున్నాయి. కాని వాటి నెవరూ తాకరాదు," అన్నది అత్త.



"ఏదీ? ఆ సరస్సెక్కడ ఉందో చూపు. నాకు కావలిసిన బంగారు తామరను నేనే తెచ్చుకుంటాను," అన్నాడు అశోకదత్తుడు.

"అది సాధ్యపడే పనా? ఆ సరస్సును భయంకరులైన రాక్షసులు అహోరాత్రాలు కాస్తూ ఉంటారు," అన్నది అత్త.

ఆమె ఎంత చెప్పినా అశోకదత్తుడు ఆ సరస్సును చూసి తీరాలని పట్టు పట్టాడు. విధిలేక ఆమె అతనికా సరస్సును చాలా దూరం నుంచి చూపింది.



ఆ సరస్సొక ఎత్తయిన కొండ చరియపై ఉన్నది. నీరు కానరాకుండా సరస్సు నిండా బంగారు తామర పూలున్నాయి. అశోకదత్తుడు ఆ సరస్సును చేరుకుని ఒక తామరను పీక బోయే టంతలో భయంకరులైన రాక్షసులు వచ్చి అతనికి అడ్డుపడ్డారు.

అశోకదత్తుడు కత్తి దూసి వారిపై కలియ బడి కొందరిని చంపేసరికి, మిగిలిన వాళ్ళు పారిపోయి, జరిగినదంతా తమ ప్రభువైన కపాలస్ఫోటుడికి చెప్పారు. ఇది వింటూనే కపాలస్ఫోటుడు బయలుదేరి వచ్చాడు.

అతను అంత దూరానే అశోకదత్తుణ్ణి చూసి ఆశ్చర్యపోయి, "ఇదేమిటి? మా అన్న అశోకదత్తు డిక్కడికి ఎలా వచ్చాడు?" అనుకున్నాడు. అతను తన చేతిలో ఉన్న ఆయుధాన్ని అవతల పారేసి, ఆనంద బాష్పాలు రాలుస్తూ వచ్చి అశోకదత్తుడి పాదాలపై పడ్డాడు.

"ఏమిటిది? ఎవరు నీవు?" అని అశోక దత్తు డడిగాడు.

"నేను నీ తమ్ముణ్ణి, విజయదత్తుణ్ణి. మనం గోవిందస్వామి కొడుకులం. విధి వశాన నేనిలా రాక్షసుణ్ణిగా మారిపోయాను. చితిలో కాలే కళేబరం యొక్క కపాలాన్ని పగల గొట్టటం చేత నాకు కపాలస్ఫోటుడని పేరు వచ్చింది. ఇంత కాలమూ నా పూర్వ వృత్తాంతం జ్ఞాపకం లేదు, కానీ నిన్ను చూడగానే అంతా జ్ఞాపకం వచ్చింది.



నా రాక్షసత్వం కూడా పోయింది," అన్నాడు విజయదత్తుడు. ఇద్దరూ ఆలింగనం చేసుకుని ఆనందాశ్రువులు రాల్చారు.

తరవాత వారిద్దరూ కలిసి, అశోకదత్తుడి అత్తగారైన రాకిసి యింటికి వెళ్ళారు. అశోకదత్తుడు తన అత్తతో తన తమ్ముణ్ణి గురించి చెప్పి, "మే మిద్దరమూ మా తల్లి దండ్రుల వద్దకు తిరిగి పోతాం. ఎన్నో ఏళ్ళ క్రితం కనిపించకుండా పోయిన నా తమ్ముణ్ణి చూసి వాళ్ళు చాలా సంతోషిస్తారు. నేను ఈసారి నా భార్యను కూడా వెంట బెట్టుకు పోతాను," అన్నాడు.

రాకిసి అత్త తన మాయా శక్తితో తన కుమార్తెనూ, అల్లుణ్ణీ, అతని తమ్ముణ్ణీ కాశీ నగరం వెలుపల ఉన్న శ్మశానానికి చేర్చింది. అక్కడి నుంచి వారు నగరంలోని తమ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళారు.

విజయదత్తుణ్ణి మళ్ళీ చూసుకుని తల్లి దండ్రులు పొందిన ఆనంద పారవశ్యానికి మేరలేదు. వారితోబాటు చుట్టు పక్కల వారు కూడా విజయదత్తుడి విచిత్ర కథను విని ఎంతో ఆశ్చర్యానందాలు పొందారు.

తన అల్లుడు తిరిగి వచ్చాడని తెలియ గానే ప్రతాపముకుట మహారాజు పరిగెత్తు కుంటూ వచ్చాడు. ఆయన కూడా అశోక దత్త విజయదత్తుల వింత కథను విని అద్భుతం చెందాడు. ఆయన తన అల్లుణ్ణి తన యింటికి తీసుకు వెళ్ళాడు. తన భర్త క్షేమంగా తిరిగి వచ్చినందుకు రాజకుమార్తె చాలా సంతోషించింది.

రాజుగారికి అనేక బంగారు తామరలు లభించాయి. ఆయన దేవాలయం యొక్క రెండో కలశం పైన కూడా ఒక బంగారు తామర ఏర్పాటు చేయించి, మిగిలిన వాటితో ఈశ్వరుణ్ణి అర్చించాడు.

విజయదత్తుడు కూడా రాజుగారి కొలువులో చేరాడు. అశోకదత్తుడు తన ఇద్దరు భార్యలతోనూ సుఖంగా కాలక్షేపం చేశాడు.





# మంత్రాల మల్లి

ఒక ఊళ్ళో పేద దంపతులుండేవారు. వారికి పిల్లలు లేరు. వారి ఇంటి పక్కన పెద్ద భవంతిలో మంత్రాల మల్లి ఉండేది.

ఒకనాడు పేదవాడి భార్య మంత్రాల మల్లి దొడ్లో ఉన్న మామిడి పళ్ళు తెమ్మని భర్త నడిగింది. అతను కాయలు కోస్తూండగా మల్లి వచ్చి పట్టుకుని, "నీకు పుట్టే బిడ్డను నా కిస్తే వదిలి పెడతా," అన్నది.

పేదవాడు సరేనని తమకు పుట్టిన ఆడపిల్ల గౌరిని మల్లి కిచ్చేశాడు.

మంత్రాల మల్లి, గౌరిని మెట్లు లేని బురుజు పైభాగాన ఉంచి పెంచి, పెద్దదాన్ని చేసింది.





మంత్రాల మల్లి రోజూ ఏవో పనుల మీద బయటికి వెళ్లి తిరిగి వచ్చి, "గౌరమ్మా, నీ జుట్టు, కిందికి జార్చి పట్టు," అని పాట పాడేది. గౌరి పైనుంచి తన నిడుపైన వెంట్రుకలను కిందికి జార విడిచేది. వాటిని పట్టుకుని మల్లి పైకి ఎక్కి వెళ్ళేది.

ఆ దేశపు రాజకుమారు డొకనా డిదంతా చూశాడు. మంత్రాల మల్లి బయటికి వెళ్ళి ఉన్న సమయంగా చూసి బురుజు కిందికి వచ్చి, "గౌరమ్మా, నీ జుట్టు, కిందికి జార్చి పట్టు," అని పాడాడు. గౌరి రాజకుమారుణ్ణి చూసి తన జుట్టు సహాయంతో అతన్ని బురుజు పై కెక్కి రానిచ్చింది. ఇద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకుని, పారిపోదా మనుకున్నారు. రాజకుమారుడు బురుజు నుంచి దిగటానికి తాళ్ళు తయారు చేశాడు.





సమయానికి మంత్రాల మల్లి వచ్చి రాజకుమారుడి కళ్ళు పొడిచేసింది. బురుజు పైకి ఎక్కి వెళ్ళి గౌరి జుట్టును కత్తెరతో కత్తిరించేసి, ఆమెను అరణ్యం మధ్య విడిచి పెట్టేసింది.

గుడ్డివాడై తడువుకుంటూ తిరుగుతున్న రాజకుమారుడికి అరణ్యం నుంచి విషాద గీతం వినిపించింది. అతను అటుకేసి పరిగెత్తాడు. గౌరి తన ప్రియుణ్ణి దగ్గిరికి తీసుకుని అశ్రువులు రాల్చింది. అవి అతని కళ్ళకు తగిలి అతనికి తిరికి చూపు వచ్చేసింది.

రాజకుమారుణ్ణి పెళ్ళాడి గౌరి సుఖంగా ఉన్నది. పేదవారైన ఆమె తల్లి దండ్రుల ఆనందానికి మేరలేదు.






# సహాయం కోరిన దయ్యం

పాపన్న ఉండే గ్రామం నుంచి అతని అత్తవారి ఊరికి వెళ్ళే దారిలో కపాలీశ్వరమనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఒక శ్రీమంతుడికి శాంత అనే కూతురుండేది. ఆమెకు పెళ్ళీడు వచ్చింది.

ఆ గ్రామంలోనే జక్కన్న అనే ఒక యువకుడుండేవాడు. అతను బుద్ధిమంతుడూ, రూపసీ, తెలివి తేటలు కలవాడూ అయినప్పటికీ అనాథ, నిరుపేద. ఒకప్పుడు జక్కన్నది ధనిక కుటుంబమే కాని అతని తండ్రి దురభ్యాసాల వల్ల ఉన్నదంతా పోయింది. జక్కన్న చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకుని, దారిద్ర్యావస్థలో పడి, ఆ గ్రామంలో వారాలు చేసుకుంటూ చదువుకో వలిసిన స్థితికి దిగజారాడు.

అయితే ఊళ్ళో వాళ్ళు జక్కన్నను అభిమానించి అతనికి తిండి బాధ లేకుండా చూశారు. తనకు భోజనం పెట్టే ఇళ్ళలో అతను ఏవైనా చిల్లర పనులు కూడా చేసి సహాయంగానూ, చనువుగానూ ఉండేవాడు. అతనికి శాంత తండ్రి ఇంట కూడా వారం ఉండేది. ఆ విధంగా అతనికీ శాంతకూ పరిచయం ఏర్పడి, అది చనువుగానూ, చివరకు ప్రేమగానూ మారింది. శాంత ఎప్పటికైనా జక్కన్న భార్య కావాలని నిశ్చయించుకున్నది. జక్కన్నకు కూడా ఆమె పైన చాలా అపేక్ష ఉండేది. వారిద్దరూ తమ మనసు లొకరికొకరు తెలుపుకుని, పెళ్ళి ప్రమాణం కూడా చేసుకున్నారు.

తన తల్లి దండ్రులు తన పెళ్ళి గురించి ఆలోచిస్తున్నారని తెలిసి శాంత తన మనస్సులోని కోరికను తల్లితో చెప్పింది.

శాంత జక్కన్న వంటి పుట్టు దరిద్రుణ్ణి పెళ్ళాడటం ఆమె తల్లి దండ్రులకు ఎంత







మాత్రమూ నచ్చలేదు. అటువంటి వాడిపైన మనసుంచి నందుకు వా రామెను గట్టిగా చివాట్లు పెట్టి, ఇక ముందు తమ గుమ్మం తొక్కవద్దని జక్కన్నకు ఆంక్ష కూడా పెట్టారు.

వ్యవహారం ఇలా పరిణమించటం శాంతకూ, జక్కన్నకూ కూడా పెద్ద దెబ్బ అయింది. కాని వారి మనసులు మాత్రం మారలేదు. జక్కన్న ఆ గ్రామం వదిలిపెట్టి రాజధానికి వెళ్ళిపోయి రాజుగారి కొలువులో చేరే అవకాశం సంపాదించుకున్నాడు. అతను కపాలీశ్వరానికి తిరిగి వచ్చి, శాంత తండ్రి ఇంట పని చేసే ఒక ముసలి దాసిని కలుసుకుని, "శాంతకు రహస్యంగా ఒక వార్త చెప్పాలి. నాకు ఆస్థానంలో ఉద్యోగం దొరుకుతున్నది. ఇవాళ రాత్రి శాంత రెండు జాముల వేళ సత్రం దగ్గిరికి వచ్చినట్టయితే నే నక్కడ వేచి ఉంటాను. తరవాత మే మిద్దరమూ రాజధానికి వెళ్ళి అక్కడ పెళ్ళి చేసుకుంటాం. ఈ మాట శాంతకు చెబుతావా?" అన్నాడు. దాసీది సరేనన్నది.

దాసీ దాని ద్వారా జక్కన్న సందేశం అందుకుని ఆ రాత్రి శాంత తన నగలూ, కొద్ది బట్టలూ మూట గట్టుకుని సరిగా నడిరాత్రి వేళ బయలుదేరింది. కాని ఆమె ఇంకా ఇంటి ఆవరణ దాటకముందే తల్లిదండ్రులకు దొరికి పోయింది. తల్లి ఆమెను నానా మాటలూ అన్నది. తండ్రి కొట్టాడు కూడా. ఆమె తమ వంశానికి అపకీర్తి తెస్తున్నదని ఇద్దరూ ఆడిపోశారు. ఆ తరవాత ఆమెకు ఇల్లే చెరసాల అయిపోయింది.

ఆ రాత్రి జక్కన్న సత్రం అరుగు పైన కోడి కూసిన దాకా శాంత కోసం ఎదురు చూసి, నిరాశ చేసుకుని, రాజధానికి బయలుదేరి వెళ్ళిపోయి, కొలువులో చేరాడు. తరవాత కొద్ది రోజులకే ఆ రాజుకు పొరుగు రాజుతో చిన్న యుద్ధం తటస్థించింది. జీవితం







పైనే విరక్తి చెంది ఉన్న జక్కన్న ఆ యుద్ధంలో చావుకు వెరవకుండా పోరాడి తీవ్రంగా గాయపడి చాలా రోజులు మంచములో ఉండి చికిత్స పొందాడు.

ఈ లోపల శాంతకు తల్లి దండ్రులు పెళ్ళి చేసేసి, ఆమె బాధ్యత వదిలించుకోవటానికి విశ్వప్రయత్నాలు చేశారు. కాని అవి ఫలించలేదు. సంబంధాలు రాలేదు. ఆమెకూ, జక్కన్నకూ మధ్య ప్రేమ ఉండిన సంగతి ఎవరికీ తెలియదని వాళ్ళు అనుకున్నారే గాని అది అదివరకే ఊరంతటికీ తెలిసిపోయింది. అందుచేత శాంతను పెళ్ళాడటానికెవరూ వచ్చారు కారు. "నా కడుపు చెడ పుట్టింది. దీన్నెవ్వరూ పెళ్ళాడరు!" అని తండ్రి కూతుర్ని తిట్టుకున్నాడు. వ్యవహారం ఇంతదాకా వచ్చాక తన కూతుర్ని ఆ జక్కన్నకే ఇచ్చి చేద్దామన్నా అతని జాడ తెలియలేదు. కష్టపడి విచారిస్తే అతను ఏనాడో యుద్ధంలో చచ్చిపోయాడని ఎవరో అన్నారు.

ఆ దుర్వార్త వినగానే శాంత ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకున్నది. ఆమె ఒక నాటి అపరాహ్ణంవేళ, తండ్రి ఇంట లేక, తల్లి ఏదో పనిలో ఉన్న సమయంలో ఇంటి నుంచి బయలుదేరి నడవసాగింది. సూర్యా




స్తమయం వేళకు ఆమె ఒక నిర్జన ప్రదేశంలో ఉన్న ఒక పెద్ద చెరువు వద్దకు వచ్చి, అందులో పడబోయింది.

కాని ఆమెను ఎవరో వెనక్కు తోసినట్టయింది. "అయ్యో!" అంటూ ఆమె చతికిలబడి, చుట్టూ చూసింది. అయితే ఎవరూ కనిపించలేదు. ఆమె మళ్ళీ లేచి చెరువుకేసి పరిగెత్తబోయింది. మళ్ళీ ఎవరో వెనక నుంచి లాగి నట్టయింది. ఆమె మళ్ళీ చతికిలబడి చుట్టూ చూసింది. ఎక్కడా ఎవరూ కనిపించలేదు. మూడోసారి కూడా అలాగే జరిగేసరికి, "అయ్యో, నన్ను చావనీ!" అని గట్టిగా అరిచింది.



అదే సమయంలో పాపన్న తన అత్తగారి గ్రామం వెళ్ళి బండి మీద తిరిగి వస్తూ శాంత పెట్టిన కేక విన్నాడు. బండి దగ్గరికి రాగానే అతనికి చెరువు గట్టు మీద చతికిల పడి ఉన్న శాంత కనపడింది.

పాపన్న దారిలో బండి ఆపి, దిగి, ఆమెను సమీపించి, "ఎవరమ్మా నువ్వు? ఇక్కడ ఒంటరిగా ఏం చేస్తున్నావు? ఇప్పుడు గట్టిగా అరిచినట్టున్నావు దేనికీ?" అని అడిగాడు. శాంత దాచకుండా తనకు వచ్చిన కష్టమంతా చెప్పుకున్నది.

"అమ్మా, ఆత్మహత్య మహాపాపం. నీకు నీ తల్లిదండ్రుల ఇలు నరకం లాగుంటే మా ఇంటికి వచ్చి ఉండు. నీకే కష్టమూ, బాధా లేకుండా నేను కాపాడతాను," అన్నాడు పాపన్న.

శాంతకు పాపన్నను చూస్తున్న కొద్దీ అతను తప్ప తన కెవరూ ఆప్తులు లేరని పించింది. ఆమె వాళ్ళ ఇంటికి అతని వెంట వెళ్ళటానికి ఒప్పుకున్నది.

అప్పటికే చీకటి పడుతున్నది. సమీప గ్రామానికి పోవాలన్నా నాలుగైదు మైళ్ళు వెళ్ళాలి. చెరువుకు ఇవతలి పక్కన ఒక పురాతన భవనం ఉన్నది. పాపన్న శాంతను బండిలో ఎక్కించుకుని ఆ భవనం దగ్గిరికి తోలుకు పోయాడు.

అప్పుడే చంద్రోదయ మయింది. భవనం పాడుపెట్టి ఉన్నదేగాని శిథిలం కాలేదు. ఇంటి ముందు అక్కడక్కడా పిచ్చి మొక్కలూ, గడ్డి తుప్పలూ ఉన్నాయి. పాపన్న దీపం వెలిగించి, బండి నుంచి వంట సామగ్రి దింపి, రాళ్ళు పెట్టి పొయి ఏర్పాటు చేసి, చెరువు నుంచి నీరు తెచ్చాడు. ఇద్దరూ చేరి తేలిక వంట చేసేశారు.

ఇంటికి పెడగా ఉన్న దారి వెంట గుర్రం మీద వెళ్ళే ఒక పెద్ద మనిషి, ఆ ఇంట దీపం వెలుగుతూండటం చూసి, "ఎవరం డోయ్! ఆ దయ్యాల కొంపలో ఉండకండి!

చచ్చి పోతారు!" అని హెచ్చరించి తన దారిన వెళ్ళిపోయాడు.

పాపన్నకు దయ్యాల భయంలేదు. శాంత నడిగితే "చావటానికే సిద్ధమైనదాన్ని నాకేం భయం?" అన్నది.

"నిన్ను చెరువులో పడకుండా ఆపినది ఈ ఇంటి దయ్యమే అయి ఉంటుంది. అది మంచి దయ్యమే అయి ఉండాలి," అన్నాడు పాపన్న. వాళ్ళిద్దరూ తేలికగా భోజనం చేసి ఇంటి ముందు వసారాలో చెరొకపక్కా నడుములు వాల్చి, పడుకుని నిద్రపోయారు.

అర్ధ రాత్రివేళ ఎవరో మాట్లాడిన అలికిడి అయి పాపన్నా, శాంతా కూడా కళ్ళు తెరిచి చూశారు. ఒక తెల్లటి ఆకారం గాలిలో తేలి ఉండటం వారిద్దరికీ కనిపించింది. దాన్ని చూసి శాంత కెవ్వున అరిచింది.

"భయపడకు, తల్లీ. నేను నీ కేమీ అపకారం చెయ్యను," అన్నదా ఆకారం.

పాపన్న లేచి కూర్చుని, "ఎవరయ్యా నీవు? నీకేం కావాలి?" అని అడిగాడు.

"నా కొక్క ఉపకారం చెయ్యాలి, నాయనా. నేనీ యింటి యజమాని అయిన గోపన్నను. ఇప్పుడు పిశాచంగా ఉన్నాను. ఈ అమ్మాయి నా మనవడి భార్య. ఈమె భర్తను తెచ్చి, ఇద్దరినీ ఈ ఇంట కాపరం పెట్టాలి. అంతదాకా నాకీ పిశాచపు బ్రతుకు





తప్పదు. ఆ పని చేసి నీవు పుణ్యం కట్టుకున్నావంటే నాకు విమోచనం కలుగుతుంది,'' అన్నదా ఆకారం.

''సహాయం చెయ్యటానికి నేను సిద్ధమే గాని, ఈ ఇంట ఎవరుగాని ఎలా కాపరం ఉంటారు?'' అని పాపన్న అడిగాడు.

''నాయనా, ఈ ఇల్లిలా ఉండటానికి నేను తప్ప మరో కారణ మేమీ లేదు. ఈ ఇంట అంతులేని ధనమున్నది. నిక్షేపమంటి ఇల్లు. నా కథ చెబుతాను విను,'' అంటూ పిశాచం తన కథను ఇలా చెప్పింది:

''ముప్ఫై ఏళ్ళ క్రితం నేనీ ఇంట గోపన్న ప్రభువనే పేరుతో మహా వైభవంగా బతికాను. నా కొడుకు చెడ్డ సహవాసాలు మరిగి, నన్ను తృణీకరించి ధనం నీరులాగా వ్యయం చెయ్యసాగాడు. నేను నా స్వార్జిత మంతా వెండి బంగారాలుగా మార్చి ఈ ఇంటి నట్టింట పాతి పెట్టాను. ఆ రహస్యం నాతోనే పోయింది. నా అనంతరం నా కొడుకు స్థిరాస్తి పైనా, ఈ ఇంటి మీదా దొరికినంత మేరకు అప్పులు చేసి, బాకీదార్ల బాధ పడలేక, తన చిన్న కొడుకును గాలికి వదిలేసి, తను కాస్తా దేశాలమీద పారిపోయి, దిక్కులేని చావు చచ్చాడు. అప్పులవాళ్ళు ఇల్లు ఆక్రమించుకున్నారు. కాని నేనీ రూపంలో ఈ ఇంటిని అంటి పెట్టుకుని ఉండి, ఈ ధనాన్ని కాపాడుతూ, ఇందులో ఎవరూ కాపురం చెయ్యటానికి అస్కారం లేకుండా చేస్తూ వచ్చాను. నా మనవడు జక్కన్న. వాడు వచ్చి ఈ ఇంట కాపరం ఉంటే నా భారం వదిలిపోతుంది. ప్రయాణీకులు ఈ ఇంటి సంగతి తెలియక ఇక్కడికి వచ్చినప్పుడల్లా, నా మనవణ్ణి తీసుకురమ్మని వాళ్ళను అడుగుతూ వచ్చాను. అందరూ దడుచుకుని పారిపోయారు. ఒక్కరూ నాకు సహాయం చెయ్యలేదు. నా అదృష్టం కొద్దీ ఇవాళ నా మనవడి భార్యే ఇటుగా వచ్చింది. ఆమె చెరువులో పడకుండా కాపాడాను.''



అంతా విని పాపన్న, "నీ మనవడు జక్కన్న ఎక్కడుంటాడో?" అన్నాడు.

"వాడు రాజధానిలో ఉన్నాడు. చికిత్స పొంది ఇప్పుడు ఆరోగ్యవంతుడుగా కూడా ఉన్నాడు," అన్నది పిశాచం.

"నువే వెళ్ళి నీ మనవడితో ఇదంతా చెప్పలేక పోయావా?" అన్నాడు పాపన్న.

"నేను పాతిపెట్టిన ధనం నా మనవడికి చెందాలన్న దిగులుతోనే కదా నేను పిశాచాన్నయాను? దాన్ని విడిచిపెట్టి పోవటం నాకు సాధ్యంకాదు. అహోరాత్రాలు దాన్ని కాపాడటమే నా పని," అన్నది పిశాచం.

"సరే, నేను నీ మనవణ్ణి వెతికి తెచ్చి ఈ ఇంట కాపరం పెట్టిస్తాను. నీవు నిశ్చింతగా ఉండు," అన్నాడు పాపన్న. పిశాచం అదృశ్యమయింది.

కిందటి రాత్రి గుర్రం మీద వెళ్ళిన మనిషి తిరిగి తెల్లవారి అటుగా వస్తూ, కిందటి రాత్రి తాను చూసిన మనుషు లింకా బతికి ఉన్నందుకూ, అక్కడే ఉన్నందుకూ ఆశ్చర్య పోయాడు. ఆ భవనం గోపన్న అనే పిసినిగొట్టు దనీ, ఆ గోపన్నే దయ్యమై ఆ యింట ఉంటున్నట్టు అందరూ చెప్పుకుంటారనీ ఆ మనిషి పాపన్నతో చెప్పాడు.

పాపన్న శాంతను తన బండిలో తీసుకుని రాజధానికి వెళ్ళాడు. అక్కడ అతనికి జక్కన్న జాడ సులువుగానే తెలిసింది. జక్కన్నకు అన్ని విషయాలూ చెప్పి అతన్ని గోపన్న ఇంటికి తీసుకు వచ్చాడు పాపన్న.

పాపన్నా, జక్కన్నా నట్టింటో తవ్వగా, పిశాచం చెప్పినట్టే ఒక పెట్టెలో అంతులేని వెండి నాణాలూ, బంగారు నాణాలూ దొరికాయి. పాపన్న కొన్ని రోజులపాటు అక్కడే ఉండి, భవనాని కంతకూ వెల్ల వేయించి, దొడ్డి బాగు చేయించి, జక్కన్నకూ శాంతకూ పెళ్ళి చేయించి, తానే స్వయంగా కన్యాదానం చేసి, వారిద్దరి చేతా ఆ ఇంట కాపరం పెట్టించి, తిరిగి తన ఇల్లు చేరుకున్నాడు.






# ఏది గొప్ప విద్య?

ఒక గ్రామం నుంచి ముగ్గురు కుర్రవాళ్ళు ఒక గురువుగారి వద్ద చదువుకోవటానికి కలిసి వెళ్ళారు. గురువు మహా విద్వాంసుడు, ఎవరికే విద్య కావాలంటే ఆ విద్య చెప్పగలవాడు. కలిసి వచ్చిన విద్యార్థులలో ఒకడు వైద్య శాస్త్రం ప్రారంభించాడు, రెండో వాడు జ్యోతిషం నేర్చుకున్నాడు, మూడో వాడు తర్కం అభ్యసించాడు. గురువుగారు వాళ్ళను పరీక్షకుపెట్టి చూడవలిసి ఉంది.

ఒక రోజు ఒక పెద్దమనిషి గురువుగారి దగ్గిరికి ఒక జాతకం తెచ్చాడు. ఆ జాతకం గల యువకుడికి తన కుమార్తె నిచ్చి చేద్దామనుకుంటున్నానని ఆయన గురువుతో చెప్పి, "మిగిలిన అన్ని విషయాలూ మాకు చాలా తృప్తికరంగా ఉన్నాయి. ఆ అబ్బాయి జాతకం చూసి మీరు వివాహం చెయ్యమంటే చేసేస్తాను," అన్నాడు.

గురువుగారు ఆ జాతకాన్ని చూసి, "ఈ కుర్రవాడికి వివాహయోగంతో బాటు కొంచెం దుష్టగ్రహ వీక్షణ కూడా ఉన్నది. పెళ్ళి అయిన కొద్ది కాలానికి జబ్బు చేస్తుంది," అన్నాడు. ఈ మాట విని పెద్ద మనిషి దిగులు పడిపోయాడు.

గురువుగారు తన ముగ్గురు శిష్యులను సంప్రతించుతున్నట్టుగా, "మీరీ పెద్ద మనిషికి ఏమి సలహా ఇస్తారు?" అన్నాడు.

వెంటనే తర్కం చదువుకున్నవాడు, "ప్రతి జాతకంలోనూ ఎప్పుడో ఒకప్పుడు దుష్టగ్రహ వీక్షణ ఉండనే ఉంటుంది. ఇతర విషయాలన్నీ అనుకూలంగా ఉన్నప్పుడు తప్పక వివాహం జరిపించవలిసిందే," అన్నాడు.

వైద్యం నేర్చుకున్నవాడు, "వరుడికి జబ్బేగదా చేస్తుంది? జబ్బు చెయ్యని

ఎస్. చలపతిరావు



వా రెవరున్నారు? మంచి వైద్యుణ్ణి మాట్లాడి చికిత్స చేయిస్తే ఎంత లావు జబ్బయినా నయమై పోతుంది," అన్నాడు.

జ్యోతిషం నేర్చుకున్నవాడు, "దీని కింత రాద్ధాంతమేమిటి? ఏ గ్రహాల వీక్షణ బాగా లేదో మనకు తెలుసు గనక, పెళ్ళి సమయంలోనే ఆ గ్రహాలకు శాంతి జరిపిస్తే ఏ జబ్బూ చెయ్యదు," అన్నాడు.

మరి కొంత కాలానికి, గురువుగారు పొరుగూరు వెళ్ళిన సమయంలో, గురువుగారి చిన్న బిడ్డకు జ్వరం వచ్చింది. గురువుగారి భార్య బిడ్డ ఒళ్ళు తాకి చూసి, "అయ్యో, బిడ్డ శరీరం కాలిపోతున్నది. ఏంచెయ్యాలో కాస్త చూడండి," అని శిష్యులను అడిగింది.

"చన్నీళ్ళు పోస్తే వేడి దానంతట అదే తగ్గిపోతుంది," అంటూ తార్కికుడు బిందె తీసుకుని చెరువుకు బయలుదేరాడు.

జ్యోతిష్కుడు పంచాంగం తీసి, ఆ రోజు తిథి వార నక్షత్రాలూ, హోరలూ లెక్క చూసి ఏ గ్రహ దోషం చేత జ్వరం వచ్చిందో చూడటానికి కూర్చున్నాడు.

వైద్యుడు బిడ్డను పరీక్షించి అది ఎలాటి జ్వరమో తేల్చుకుని, పోపుల పెట్టెలో నుంచి కావలిసిన దినుసులు తీసుకుని, నూరి తేనెలో రంగరించి బిడ్డ నాలుకకు రాచాడు.



ఆ సాయంకాలం గురువుగారు ఇంటికి వచ్చే సరికి బిడ్డకు జ్వరం తగ్గిపోయి మామూలుగా ఉన్నది.

గురువుగారి భార్య జరిగిన సంగతి తన భర్తకు చెప్పి, "ఏమండీ, జ్యోతిషం వల్ల లాభం ఉండటం చూశాను, వైద్యం వల్ల లాభం చూశాను. కాని తర్కం దేనికి పనికి వస్తుంది? మీ దగ్గిర తర్కం నేర్చుకున్న మూఢుడు జ్వరం వచ్చిన బిడ్డకు చన్నీళ్ళు స్నానం చేయించ బోయాడు తెలుసా?" అన్నది.

"జ్యోతిషమూ, వైద్యమూ అవసరం పడినప్పుడే పనికివస్తాయి. కాని తర్కం

అస్తమానమూ అవసరమే. రేపే వాడికి పరీక్ష పెడతాను," అంటూ గురువుగారు తాను తార్కిక శిష్యుడికి పెట్ట బోయే పరీక్ష ఏమిటో చెప్పి, ఆమె చేయవలిసినది కూడా వివరించాడు.

మర్నాడు మధ్యాన్నం వేళ అందరూ కలిసి భోజనాలు చేస్తున్న సమయంలో గురువుగారు, "పొరపాటున చిక్కుడు గింజంత విషపు పురుగును మింగేశా న్రోయ్!" అని అరిచి, స్పృహ తప్పి పోయిన వాడిలాగా గోడకి చేరగిలబడి, కొయ్య బారిపోయాడు.

"అయ్యో, అయ్యో! గురువుగారి సంగతి చూడండ్రా!" అన్నది గురువుగారి భార్య.

వైద్యుడూ, జ్యోతిష్కుడూ చప్పున భోజనం చెయ్యటం మానేసి లేచి చేతులు కడుక్కున్నారు. వైద్యుడు వచ్చి గురువు గారి నాడి పరీక్షించసాగాడు. జ్యోతిష్కుడు పంచాంగం తీశాడు. తార్కికుడు మాత్రం గురువుగారి కేసి ఒక్క క్షణం చూసి, తన మానాన తాను భోజనం చెయ్యసాగాడు.

గురువుగారి భార్య అతనితో, "నువు ఏమన్న శిష్యుడివి? గురువుగారు విషపు పురుగును మింగి పడిపోతే ఏమీ జరగనట్టు భోజనం చేస్తున్నావే?" అన్నది.

"గురువుగారు ఏ విషపు పురుగునూ మింగలేదు. ఒక పురుగును మింగుతున్నా ననీ, అది విషపు పురుగనీ, చిక్కుడు గింజంత ఉన్నదనీ కళ్ళారా చూసి కూడా మింగటానికి గురువుగారు వెర్రివాడు కాదు. ఒక వేళ పురుగు నోట్లోకి వెళ్ళాకనే తెలిసినా ముద్ద విసర్జిస్తారు గాని మింగెయ్యరు," అన్నాడు తార్కికుడు.

గురువుగారు కళ్ళు తెరిచి లేచి కూర్చుని తన భార్యతో, "చూశావుటే, తర్కం వల్ల ఉండే ఉపయోగం?" అన్నాడు.

ఆ తరవాత ఆయన ముగ్గురు శిష్యులకూ చదువు పూర్తి అయిందని చెప్పి పంపేశాడు.





# అమాయకుడి అదృష్టం

ఒక గ్రామంలో సుబ్బన్న అనే కుర్రాడుండే వాడు. వాడికి తల్లీ, తండ్రీ లేక పోవటంచేత వాణ్ణి వాడి బామ్మ పెంచుతూ వచ్చింది. ఆవిడకు మనవడంటే చాలా గారాబం. ఊళ్ళో పిల్లలు దుష్టులనీ, వాళ్ళ సావాసం చేస్తే తన మనవడు చెడిపోతాడనీ అనుకుని ఆవిడ వాణ్ణి ఎవరితోనూ స్నేహం చెయ్య నిచ్చింది కాదు. ఆ కారణంచేత వాడు బొత్తిగా ప్రపంచ జ్ఞానం ఏమీ లేకుండా పెరగసాగాడు.

ఒక రోజు సుబ్బన్న బామ్మ చేసి ఇచ్చిన గారెలు తీసుకుని, ఊరి బయట ఉన్న మర్రి చెట్టు కిందికి వెళ్ళి కూర్చుని, అక్కడ వాటిని తినసాగాడు. వాణ్ణి చూసి నాలుగు కుక్కలు తోకలాడించుకుంటూ వాడి దగ్గిరి కొచ్చాయి. సుబ్బన్న వాటికి తలా ఒక గారె తుంపూ వేశాడు. తరవాత అవి వాడి మీద ఎంతో స్నేహం చూపి, వాణ్ణే పట్టుకుని వేళ్ళాడాయి. చీకటి పడిన దాకా వాడు ఆ కుక్కలతో ఆడుకుని ఇంటికి వెళ్ళాడు.

అది మొదలు రోజూ వాడు మర్రి చెట్టు కిందికి వెళ్ళి కూర్చునేవాడు. ఆ కుక్కలు తోకలాడిస్తూ వచ్చేవి. తాను తినటానికి తెచ్చుకున్న దానిలో నుంచి వాడు వాటికి కూడా కొంచెం వేసేవాడు. ఈ విధంగా ఆ కుక్కలకు వాడిపై స్నేహమూ, విశ్వాసమూ పెరిగి పోయాయి. వాడు ఆ కుక్కలకు రంగడూ, లింగడూ, రాముడూ, భీముడూ అని పేర్లు పెట్టి, ఆ పేర్లతో పిలిచే వాడు.

సుబ్బన్న రోజూ ఎక్కడికో వెళ్ళి చీకటి పడ్డాక వస్తూండటం గమనించి బామ్మ, "రోజూ ఎక్కడికిరా వెళతావు?" అని అడిగింది.

సి. భుజంగశర్మ





"ఊరి చివర మర్రి చెట్టు కిందికి వెళ్ళి రంగడితోనూ, లింగడితోనూ, రాముడితోనూ, భీముడితోనూ ఆడుకుంటాను," అన్నాడు సుబ్బన్న.

"వాళ్ళెవరు?" అని బామ్మ అడిగింది.

"చాలా మంచి వాళ్ళు, నేను చెప్పినట్టు వింటారు. మాట్లాడను కూడా మాట్లాడరు," అన్నాడు సుబ్బన్న.

బామ్మ కొక ఆలోచన వచ్చింది. సుబ్బన్న ప్రతి సాయంకాలమూ మర్రి చెట్టు కింద కూర్చుంటూనే ఉన్నాడు. కాసిని ఆట్లు వేసి ఇస్తే, అవి పెట్టుకుని కూర్చుని, వాటిని వచ్చే పొయ్యే జనాని కమ్మి, నాలుగు డబ్బులు సంపాదించుకున్న ప్రయోజకుడవుతాడు. ఈ మాట అనుకుని బామ్మ సుబ్బన్న చేతి కొక అర్ధరూపాయి ఇచ్చి, "ఇందులో పావలా పెట్టి మినప్పప్పు కొని, మిగిలిన పావలా పట్టుకురా," అన్నది.

మినప్పప్పు ఏ దుకాణంలో అమ్ముతారో కూడా సుబ్బన్నకు తెలీదు. "మినప్పప్పు ఉన్నదా?" అని వా డొక పళ్ళ దుకాణంలోనూ, పూల దుకాణంలోనూ, కట్టెల అడితీలోనూ అడిగి లేదనిపించుకుని, ఎవరో కిరాణా కొట్టు చూపించిన మీదట ఆ కొట్టుకు వెళ్ళి, ఒక పావలా మినప్పప్పియ్యమని, అర్ధరూపాయి బిళ్ళ దుకాణదారు చేతిలో పెట్టాడు. దుకాణంవాడు పావలా మినప్పప్పు పొట్లం కట్టి సుబ్బన్న చేతిలో పెట్టి, "చిల్లర లేదు. రెండో పావలా కింకేమన్నా తీసుకుంటే తీసుకో, లేకపోతే రేపు ఉదయంరా, యిస్తాను," అన్నాడు.

"రేప్పొద్దున వస్తాను," అని సుబ్బన్న అంగడివాడితో చెప్పి ఇంటికి బయలుదేరాడు. కొద్ది దూరం వెళ్ళాక వాడికి అంగడి గుర్తుంచుకోవటం అవసర మన్నది తట్టింది. అందుచేత వాడు వెనక్కు వెళ్ళి చూసే సరికి అంగడి గోడపక్కగా ఒక తెల్ల పిల్లి పడుకుని ఉన్నది. ఆ సంగతి జ్ఞాపకం

ఉంచుకుని సుబ్బన్న ఇంటికి వచ్చేసి, బామ్మకు మినప్పప్పు ఇస్తూ, "మిగిలిన పావలా రేపొద్దున వస్తే ఇస్తానన్నాడు కొట్టువాడు," అన్నాడు.

"ఊళ్ళో చాలా కొట్లుంటాయి. నువు కొన్నదే కొట్టులోనో?" అన్నది బామ్మ.

"కొట్టు బాగా గుర్తుంచుకున్నాలే," అన్నాడు సుబ్బన్న.

బామ్మ మినప్పప్పు నానబోసి, మర్నాడు పిండి రుబ్బి అట్లు పోసింది. సుబ్బన్న పావలా వసూలు చేసుకు రావటానికి బయలుదేరాడు. తెల్ల పిల్లి కోసం చూసుకుంటూ వాడొక అంగడి దగ్గిరికి వచ్చి ఆగాడు. ఆ అంగడి గోడపక్కగా ఒక తెల్ల పిల్లి పడుకుని ఉన్నది.

అయితే ఆ కొట్టు ఒక దర్జీవాడిది. దర్జీ వాడు కొట్టు లోపల ఏవో గుడ్డలు కత్తిరిస్తున్నాడు. అది చూసి సుబ్బన్న ఆశ్చర్యపోయాడు. ఇంకొక వింత ఏమిటంటే, దుకాణం మారినట్టే, దుకాణదారు కూడా మారి పోయాడు. అతనికి నిన్న రాత్రికూడా మీసాలు లేవు, కాని ఇప్పుడు పెద్ద మీసాలున్నాయి. ఒక్క రాత్రిలో అంత మీసం పెరగటం వాడికి ఆశ్చర్యం కలిగించింది. వాడు దర్జీవాడి దగ్గిరకుపోయి తన పావలా తన కిచ్చెయ్యమన్నాడు.





"ఏం పావలా? ఎవరి నడుగుతున్నావు?" అన్నాడు దర్జీవాడు ఆశ్చర్యంగా.

"నిన్నే అడుగుతున్నాను. నిన్న పావలా మినప్పప్పిచ్చి మిగిలిన పావలా చిల్లర లేదంటివే!" అన్నాడు సుబ్బన్న.

"పోరా, పిచ్చివాడా?" అంటూ దర్జీ వాడు సుబ్బన్నను అంగడి నుంచి తరిమాడు.

"నా పావలా ఎగ్గొట్టాలని ఎన్ని దొంగ వేషాలు వేస్తున్నావ్! నిన్న మీసాలు లేకుండా మినప్పప్పు అమ్మావు, ఇవాళ మీసాలు పెంచి బట్టలు కత్తిరిస్తున్నావు. నా పావలాతో ఏం బాగుపడతావో నేనూ చూస్తాను," అన్నాడు సుబ్బన్న.



వాడు అటూ ఇటూ చూసేసరికి కొట్టు బయట కత్తిరించిన గుడ్డ ముక్కల కుప్ప కనిపించింది. సుబ్బన్న ఆ గుడ్డ ముక్కల కుప్పను తన పై బట్టలో మూట కట్టుకుని ఇంటికి పోయాడు.

మనవడు విప్పే మూటను చూసి బామ్మ చాలా ఆశ్చర్యపడి, "అదంతా ఏమిటిరా?" అని అడిగింది.

"కొట్టు వాడు పెద్ద మోసం చేశాడు. పావలా ఇయ్యలేదు. అందుకని వాడి కొట్టు నుంచి ఇవి తెచ్చాను," అంటూ సుబ్బన్న మూటలోని గుడ్డ పేలికలను కింద కుమ్మరించాడు. ఏదో కంగున మోగింది. తీసి చూస్తే రూపాయి బిళ్ళ!

"చూశావురా, సుబ్బడూ? దేవుడు లేడూ? వాడు మన పావలా తినేద్దామని చూస్తే వాడి రూపాయి మనకు వచ్చేసింది," అన్నది బామ్మ.

ఆవిడ అట్లు వేసి, అందులో పది సుబ్బన్న కిచ్చి, "ఇవి తీసుకుపోయి అమ్ము. ఇందులో రెండు నువు తిని మిగిలిన ఎనిమిదీ, అట్టు అర్థణా చొప్పున అమ్ము. నాలుగణాలు వస్తాయి," అన్నది.

సుబ్బన్న అట్లను ఒక బుట్టలో పెట్టుకుని మర్రి చెట్టు కిందికి వెళ్ళి కూర్చున్నాడు.

కుక్కలు నాలుగూ వచ్చాయి. "అట్లు అర్థణా, రెండేసి తీసుకోండి," అంటూ సుబ్బన్న నాలుగు కుక్కలకూ నాలుగు రెళ్ళు ఎనిమిది అట్లు పెట్టి, తాను రెండు తిని, "మీరంతా నాకు ఒక్కొక్క అణా బాకీ ఉన్నారు. జ్ఞాపకం ఉంచుకోండి," అన్నాడు.

వాడు ఇంటికి తిరిగి రాగానే బామ్మ, "అట్లు అమ్ముడయాయా?" అని అడిగింది.

"రంగడూ, లింగడూ, రాముడూ, భీముడూ తలా రెండు అట్లూ కొనుక్కున్నారు. వాటిని అమ్మటానికి క్షణం పట్టలేదు," అన్నాడు సుబ్బన్న.

"డబ్బులేవీ?" అన్నది బామ్మ.

"వాళ్ళ దగ్గిర ప్రస్తుతం లేవు. అప్పు పెట్టాను," అన్నాడు సుబ్బన్న.

"అరువు బేరమా? దివాలా ఎత్తిపోతాం. నిన్నటి డబ్బూ, ఇవాళదీకూడా కలిపి, నిలవేసి వసూలు చేసుకురా!" అన్నది బామ్మ.

సుబ్బన్న సరేనని మరో పది అట్లు బుట్టలో పెట్టుకుని మర్రి చెట్టు కిందికి వెళ్ళాడు. మామూలు ప్రకారం కుక్కలు తోకలాడిస్తూ వచ్చాయి. సుబ్బన్న వాటికి తలా రెండు అట్లూ ఇచ్చి, తాను రెండు తిని, "ఏవీ డబ్బులు? నిన్నటి అణా, ఇవాళ్టి అణా కలిపి రెండణాలు. ఒక్కొ



క్కరూ రెండేసి అణాలు అక్కడ పెట్టండి ముందు !" అన్నాడు.

కుక్కలు తోకాడించి, పెడితే ఇంకా అట్లు తినే వైఖరి కనబరిచాయి గాని, డబ్బు లిచ్చే వైఖరి కనబరచలేదు. సుబ్బన్నకు మండిపోయింది. వాడు పక్కనే ఉన్న కర్ర ఒకటి తీసుకుని ఒక కుక్క కాళ్ళ మీద కొట్టాడో లేదో కుక్కలన్నీ శరవేగంతో పారి పోయాయి. మూడు కుక్కలు అయిపు లేకుండా పోయాయి. దెబ్బ తిన్న కుక్క మటుకు కుంయో మని అరుస్తూ కుంటు కుంటూ పరిగెత్తసాగింది. సుబ్బన్న ఆ కుక్క వెంటనేపడ్డాడు.

ఆ కుక్క అడవి కేసి పరిగెత్తి అక్కడ ఉండే ఒక పాడు బడిన గుడిలో దూరింది. ఆ సమయాన ఆ గుడిలో కొందరు దొంగలు తాము కాజేసి తెచ్చిన డబ్బు పంచుకుం టున్నారు. వాళ్ళు కుక్క అరుపూ, మనిషి కేకలూ విని, డబ్బు అక్కడే వదిలేసి, గుడి వెనకపక్క ఉన్న మొండి గోడ దూకి పారిపోయారు.

సుబ్బన్న అక్కడికి వచ్చి, కింద కుప్పలు కుప్పలుగా పెట్టి ఉన్న డబ్బులు చూసి, "ఓహో, ఇదా మీ డబ్బు? సరే ఇదంతా నేనే ఉంచుకుని, లెక్క చూసి, ఇది పూర్తి అయేదాకా మీకు అట్లు ఇస్తూ ఉంటానులే!" అన్నాడు. వాడా డబ్బు తీసుకుని మూట గట్టుకుని, కుక్కను దగ్గరికి పిలిచి, దాని ఒళ్ళు నిమిరి, ఇంటికి వెళ్ళాడు.

సుబ్బన్న తాను తెచ్చిన డబ్బు బామ్మ కిస్తూ జరిగిన దంతా చెప్పాడు. సుబ్బన్న చెప్పే స్నేహితులు కుక్కలనీ, రెండు రోజులుగా వాడు తాను చేసిన అట్లను కుక్కలకే అమ్ముతున్నాడనీ బామ్మ కిప్పటికి తెలిసివచ్చింది. వాడి అమాయకత్వం మరొక విధంగా పోదని తెలుసుకుని, ఆ డబ్బుతో వాడికి చదువు చెప్పించి, బామ్మ వాణ్ణి తెలివి గల వాణ్ణి చేసింది.





# యుద్ధకాండ

రాముడు లంకా ప్రాసాదం సమీపానికి వచ్చి, లోపల ఉన్న సీతను తలుచుకుని, లంక పై దాడి ప్రారంభించమని వానరులకు అజ్ఞ ఇచ్చాడు. యుద్ధానికి సిద్ధంగా, చెట్లూ రాళ్ళూ పట్టుకుని ఉన్న వానరులు, రావణుడు చూస్తుండగానే, గుంపులు గుంపులుగా ప్రాకారం ఎక్కారు. వారు ప్రాకారాలనూ, పురద్వారాలనూ నాశనం చేశారు, అగడ్తలను పూడ్చారు.

రావణుడు కూడా రాక్షసులను యుద్ధానికి ఉపక్రమించమని ఆదేశించాడు. సింహనాదాలతోనూ, భేరీ భాంకారాలతోనూ, శంఖధ్వానాలతోనూ వానర రాక్షసుల మధ్య యుద్ధం ప్రారంభ మయింది.

ఇంద్రజిత్తు అంగదుడితోనూ, జంబుమాలి హనుమంతుడితోనూ, తపను డనే రాక్షసుడు గజుడితోనూ, నికుంభుడు నీలుడితోనూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. ఇదే విధంగా అనేకమంది రాక్షస వీరులకూ, వానర వీరులకూ మధ్య ద్వంద్వ యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాలలో సంపాతి అనే విభీషణ మంత్రి ప్రజంఘు డనే రాక్షసుణ్ణి చంపాడు. అలాగే ప్రఘసుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. విద్యున్మాలిని సుషేణు డనే వానరవీరుడు చంపాడు.

ఇంతలో సూర్యు డస్తమించాడు. రాత్రి వచ్చింది. కాని ఉభయపక్షాలూ విజయకాంక్షతో యుద్ధం కొనసాగించాయి.







అంగదుడికీ ఇంద్రజిత్తుకూ జరిగిన ద్వంద్వ యుద్ధంలో అంగదుడు ఇంద్రజిత్తు సారథినీ, గుర్రాలనూ చంపాడు. ఇంద్రజిత్తు అంతర్ధాన మయాడు. అతను మాయా యుద్ధానికి పూనుకుని, వానరసేన పై పిడుగుల వంటి బాణాలు వేశాడు, రామలక్ష్మణు లిద్దరి పైనా నాగాస్త్రాలు వేసి వారిని బంధించాడు, వారి శరీరాలనిండా సందు లేకుండా బాణాలు కొట్టాడు.

అతను వారితో, "రామ లక్ష్మణులారా, నేను అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తుంటే ఇంద్రుడు కూడా నన్ను తెలుసుకో లేడు, సమీపించలేడు. మీ రెంత? మిమ్మల్ని ఇప్పుడే యముడి వద్దకు పంపేస్తాను," అంటూ సింహనాదాలు చేశాడు. రామలక్ష్మణులు నేలపై పడిపోయి ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండి పోయారు. రాముణ్ణి చూసి లక్ష్మణుడికి ప్రాణభయం కలిగింది. హనుమంతుడు మొదలైన వానరులు కూడా అధైర్య పడిపోయారు. వా రాకాశ మంతా కలయ జూసినా ఇంద్రజిత్తు కనిపించలేదు.

ఇంద్రజిత్తు రామ లక్ష్మణుల నిద్దరినీ తాను చంపినట్టే భావించుకుని, వారు చచ్చారు చూడమని రాక్షసులకు చెప్పి, లంకలోకి తిరిగి వెళ్ళి పోయాడు.

ఆ రాత్రి వానరులకూ రాక్షసులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. రక్తం నదులుకట్టి పారింది. ఉత్తర ద్వారాన్ని రక్షించే యమశత్రుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, మహాకాయుడూ, వజ్రదంష్ట్రుడూ, శుకసారణులూ రాముడి పైకి యుద్ధానికి వెళ్ళి, తీవ్రమైన రాముడి బాణాలచే కొట్టబడి, పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు.

ఇంకెందరో రాక్షసులు రాముడి చేతిలో చచ్చారు. అసలే భయంకరంగా ఉన్న ఆ రాత్రి సింహనాదాలతోనూ, ప్రతిధ్వనులతోనూ మరింత భయంకరమయింది.





రామ లక్ష్మణులను చూస్తున్న కొద్దీ సుగ్రీవుడికి భయమూ, దుఃఖమూ పుట్టుకొచ్చాయి. విభీషణు డతనితో, "దుఃఖించకు. యుద్ధమంటే ఇలాగే ఉంటుంది. మొదటి నుంచి చివరదాకా జయమే కలగాలంటే కలుగుతుందా? అదృష్టం బాగుంటే రామలక్ష్మణులకు తిరిగి స్పృహ రావచ్చు," అంటూ నీటితో సుగ్రీవుడి అశ్రువులు కడిగాడు.

విభీషణుడు సుగ్రీవుడికి ధైర్యం చెప్పి, భయపడి పారిపోయే ప్రయత్నంలో ఉన్న వానరులకు ఉత్సాహం కలిగిస్తూ, సైన్యం నలుదిక్కులా తిరిగాడు. విభీషణుడి ప్రోత్సాహ వచనాలు వానరుల పై బాగా పని చేశాయి.

ఇంద్రజిత్తు తిన్నగా రావణుడి సభకు వెళ్ళి, తండ్రికి నమస్కారం చేసి, "రామ లక్ష్మణులను చంపేశాను," అని చెప్పాడు. రావణుడు పరమ సంతోషంతో ఆసనం మీది నుంచి లేచి, కొడుకును కౌగిలించుకున్నాడు. ఇంద్రజిత్తు యుద్ధ క్రమమంతా చెప్పాడు. అతన్ని తండ్రి ప్రశంసించాడు.

అతను సీతకు కాపలా ఉన్న త్రిజట మొదలైన రాక్షస స్త్రీలను పిలిపించి, "మన ఇంద్రజిత్తు చేతిలో రామ లక్ష్మణులు చచ్చారు. సీత మద మణిగింది. ఆమె ఇక సర్వాభరణాలూ ధరించి, నా దగ్గిరికి వచ్చేస్తుంది. ఆ సీతను పుష్పక విమానంలో ఎక్కించి, యుద్ధరంగానికి తీసుకుపోయి, పడి ఉన్న రామ లక్ష్మణులను చూపించండి," అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు పుష్పకం ఉన్న చోటికి వెళ్ళి, దాన్ని తీసుకుని అశోకవనానికి పోయి, అందులో సీత నెక్కించుకుని యుద్ధరంగానికి తీసుకు పోయారు. అక్కడ సీతకు పడి ఉన్న రామ లక్ష్మణులూ, వారి చుట్టూ కూర్చుని, ఏ మాత్రం అలికిడి వినిపించినా రాక్షసులు వచ్చి పడుతున్నారేమో నని



భయపడుతున్న వానర ప్రముఖులూ కని పించారు. ఆమె దుఃఖ సముద్రంలో మునిగి పోయింది.

సాముద్రిక వేత్తలూ, జ్యోతిశ్శాస్త్రం తెలిసినవారూ కూడా తనకు వైధవ్యం ఉండ దన్నారు; తాను పుత్రవతి అవుతుందన్నారు, మహారాణి అవుతుందన్నారు. తనకు మహా వీరుడు భర్త అవుతా డన్నారు. గోప్పాద మంత ఇంద్రజిత్తు ఆ మాటలన్నీ అబద్ధం చేసేశాడు. రామ లక్ష్మణులకు తెలిసిన దివ్యాస్త్రా లన్నీ ఏమయాయో? వాళ్ళు తన కోసం నాలుగు దిక్కులా వెతికించి, పెద్ద సేనతో సముద్రాన్ని కూడా దాటి లంకను చేరింది ఇంద్రజిత్తు మాయకు బలికావ టానికా? పధ్నాలు గేళ్ళూ పూర్తి కాగానే తన కొడుకు సీతా లక్ష్మణులతో తిరిగి వస్తా డని ఎదురు చూసే కౌసల్య ఏంకాను?

ఈ విధంగా దుఃఖంతో కుములుతున్న సీతను చూసి, "అమ్మా, ఏడవకు. రామ లక్ష్మణులు చావలేదు. వారు చచ్చిన లక్షణా లేవీ కనిపించవు," అన్నది త్రిజట. సీత ఆ మాట విని చేతులు జోడించి, "తథాస్తు!" అని పలికింది.

తరవాత పుష్పకం తిరిగి వెళ్ళిపోయింది. సీత మళ్ళీ అశోకవనం ప్రవేశించి, రామ లక్ష్మణులను పదే పదే తలుచుకుంటూ కన్నీరు కార్చింది.

యుద్ధరంగాన కొంత సేపటికి రాముడికి స్పృహ వచ్చింది. అతను తన పక్కన పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చనిపోయా డనుకుని నిరాశచెందాడు. లక్ష్మణుడితో బాటు తాను కూడా చావాలని నిశ్చయించు కున్నాడు. సీతవంటి భార్య వెతికితే దొరక్క పోదు, లక్ష్మణుడి వంటి తమ్ము డెక్కడ దొరుకుతాడు? లక్ష్మణుడు లేకుండా యుద్ధ మెందుకు, అందులో విజయ మెందుకు? తాను ఒంటరిగా అయోధ్యకు తిరిగి పోయి సుమిత్ర ఎదట పడగలడా? అసంభవం.

తాను విభీషణుణ్ణి లంకకు రాజుగా చెయ్యలేక పోయినందుకు రాముడు చాలా చింతించాడు. తన కోసం సుగ్రీవుడు మొదలైన వానర యోధులు పడిన శ్రమకు కృతజ్ఞత చెప్పుకుని, వారు ప్రదర్శించిన శౌర్య పరాక్రమాలను మెచ్చుకుని, అందరినీ తిరిగి వెళ్ళి పొమ్మన్నాడు.

ఇంతలో విభీషణుడు తన గదతో సహా సుగ్రీవు డున్న చోటికి వచ్చాడు. అతన్ని దూరానే చూసి, ఇంద్రజిత్తు వస్తున్నా డనుకుని వానరులు భయపడి పారిపోసాగారు. జాంబవంతుడు వెళ్ళి వాళ్ళ భయాన్ని పోగొట్టాడు. వచ్చిన వాడు విభీషణు డని చెప్పిన మీదట, పారిపోతున్న వానరులు తిరిగి వచ్చారు.

సుగ్రీవుడు తన సమీపంలో ఉన్న తన మామ సుషేణుడితో, "రామ లక్ష్మణులకు స్పృహ రాగానే వాళ్ళను తీసుకుని, కొందరు వానర వీరులతో సహా కిష్కింధకు వెళ్ళు. నేను ఈ రావణుణ్ణి చంపి సీతను తీసుకు వస్తాను," అన్నాడు.

"పూర్వం దేవాసురులకు యుద్ధం జరిగినప్పుడు అనేకమంది దేవతలు మూర్ఛపోయారు, కొందరు చచ్చిపోయారు కూడా. అప్పుడు బృహస్పతి మృతసంజీవని లాంటి విద్యల సహాయంతోనూ, మూలికల సహా







పాములు పారిపోయాయి. తరవాత అతను తన చేతులతో వారిద్దరి ముఖాలూ తడివాడు. వెంటనే వారి గాయాలన్నీ నయమై, శరీరాలకు ఎప్పటి శక్తీ, తేజస్సూ సమకూరాయి. అతడు వారిని లేవనెత్తి ప్రేమతో ఆలింగనం చేసుకున్నాడు.

రాముడు అతనితో, "అయ్యా, నిన్ను చూస్తే నాకు మా తండ్రినో, తాతనో చూసినంత ఆనందం కలుగుతున్నది. దివ్య లేపనాలూ, దివ్యాంబరాభరణాలూ ధరించి ఉన్నావు. నీ వెవరు?" అని అడిగాడు.

"నేను నీకు స్నేహితుణ్ణి. నా పేరు గరుత్మంతుడు. మిమ్మల్ని బంధించిన పాములు కద్రువ సంతానం. ఇంద్రజిత్తు తన మాయ చేత వాటికి బాణ రూపం ఇచ్చి మీపై ప్రయోగించాడు. ఈ వార్త తెలిసినే నిక్కడికి వచ్చాను. నేను నీకు ఎలా స్నేహితుణ్ణో యుద్ధంలో నీకు జయం కలిగాక చెబుతాను. రాక్షసులు మహామాయావులు. జాగ్రత్తగా వారితో యుద్ధం చెయ్యి. నీకు జయం కలుగుతుంది," అని గరుత్మంతుడు రాముడి వద్ద శలవు తీసుకున్నాడు.

వానరులకు ఉత్సాహం తిరిగి వచ్చింది. వారు భేరులు మోగించి, శంఖాలు పూరించి, సింహనాదాలు చేశారు. లంకలో రావణుడికి

యంతోనూ వాళ్ళకు చికిత్స చేశాడు. క్షీర సముద్ర మథనం జరిగిన చోట చంద్ర, ద్రోణ పర్వతా లున్నాయి. వాటి పైన దేవతలు సంజీవకరణీ, విశల్యకరణీ అనే ఓషధులను పెంచారు. హనుమంతుణ్ణి అక్కడికి పంపించి, వాటిని తెప్పించు," అన్నాడు సుషేణుడు.

ఇంతలో పెనుగాలి వీచింది. ఆ గాలి తాకిడికి మేఘాలు దూదిపింజెల్లాగా కొట్టుకుపోయాయి, సముద్రంలో పెద్ద కెరటాలు పుట్టాయి. మరి కొంత సేపటికి గరుత్మంతుడక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే రామలక్ష్మణులను బాణాల రూపంలో బంధించిన



అ ధ్వని వినిపించింది. రామలక్ష్మణులు చచ్చి పడుస్తూ ఉండవలిసిన వానరులు ఉత్సాహంతో శంఖాలూ, భేరీలూ ఎందుకు మోగిస్తున్నారో కనుక్కు రమ్మని అతను కావలివాళ్ళను పంపాడు. వాళ్ళు ప్రాకారాలపై కెక్కి, వానరసేన అంతా కలయజూసి, రావణుడి దగ్గిరికి వచ్చి, రామలక్ష్మణులు బంధవిముక్తులై సుఖంగా ఉన్నారని చెప్పారు.

ఇది విని రావణుడు తెల్లబోయి, "ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగబంధాలను విప్పటం దేవతలకైనా సాధ్యంకాదు. రామలక్ష్మణులు వాటి నుండి బయటపడటం రాక్షస సేనకు అపాయాన్ని సూచిస్తున్నది," అన్నాడు. అతను ధూమ్రాక్షు డనే వాణ్ణి పిలిచి, "సేనతో సహా వెళ్ళి రాముణ్ణి వధించిరా!" అని ఆజ్ఞాపించాడు.

ధూమ్రాక్షుడు ఒక పెద్ద సేన తీసుకుని, తోడేలు ముఖాలూ, సింహం ముఖాలూ గల గాడిదలను పూన్చిన రథ మెక్కి యుద్ధానికి బయలుదేరాడు. రాక్షసులకూ, వానరులకూ గొప్ప యుద్ధం జరిగింది. ఉభయపక్షాలా అపారమైన ప్రాణ నాశం జరిగింది. చిట్ట చివరకు వానరుల దెబ్బకు తట్టుకోలేక రాక్షసులు పారిపోసాగారు. ఇది చూసి



ధూమ్రాక్షుడు వానరసేనపై విజృంభించాడు. హనుమంతుడికి కోపం వచ్చి, పెద్ద శిలను తీసుకు వచ్చి, ధూమ్రాక్షుడి రథంపై వేశాడు. రథం నుగ్గయింది గాని ధూమ్రాక్షుడు గదతో సహా కిందికి దూకేశాడు. హనుమంతుడికీ, అతనికీ యుద్ధమయింది. ధూమ్రాక్షుడు తన గదను హనుమంతుడి తలపైకి విసిరాడు. దాని దెబ్బకు హనుమంతుడు చలించక, ధూమ్రాక్షుడి నెత్తిన పర్వత శిఖరాన్ని వేసి చంపేశాడు. వానరులు హనుమంతుణ్ణి మెచ్చుకున్నారు.

ధూమ్రాక్షుడు చచ్చాడని విని రావణుడు వజ్రదంష్ట్రుణ్ణి సేనతో సహా పంపాడు.

ఆ సేన లంక యొక్క దక్షిణ ద్వారం కుండా వెళ్ళింది. ఆ ద్వారం వద్ద అంగదు డున్నాడు. ఉభయపక్షాల మధ్యా దొమ్మి యుద్ధం, ద్వంద్వ యుద్ధాలు జరిగాయి.

యుద్ధంలో వానరులు నష్టమవుతూ ఉండటం చూసి మండిపడి, అంగదుడు విజృంభించి రాక్షసుల తలలు పగలగొట్ట నారంభించాడు. రాక్షసులా తాకిడికి తట్టుకో లేక చలించిపోయారు. తన పక్షం దెబ్బ తింటూండటం చూసి వజ్రదంష్ట్రుడు అంగ దుడితో తలపడ్డాడు. ఇద్దరికీ చాలాసేపు యుద్ధం జరిగిన మీదట అంగదుడు కత్తితో వజ్రదంష్ట్రుడి తల తెగవేశాడు. రాక్షసు లంతా లంకా నగరంలోకి పారిపోయారు.

ఈసారి రావణుడు అకంపను డనే రాక్షస సేనానిని పంపాడు. రాక్షస వానర పక్షాలు రెండూ విజయ కాంక్షతో పట్టుదలగా యుద్ధం చేశాయి. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు ఒక్కసారిగా రాక్షస సేనపైన పడి రాక్షసు లను గుంపులు గుంపులుగా వధించసాగారు.

ఇది గమనించి అకంపనుడు తన రథాన్ని ఆ వానర వీరులున్న చోటికి తోలించాడు. అతని బాణాల తాకిడికి వానర వీరులు తట్టుకో లేకపోయారు. అకంపనుడి చేతిలో చావటానికి సిద్ధంగా ఉన్న వానరులకు అండగా హనుమంతుడు వచ్చాడు.

అతను అకంపనుడి బాణాలను లక్ష్య పెట్టకుండా, ఆయుధంగా ఒక కొండను పెరికి, ఒంటి చేత పట్టి గిరగిరా తిప్పి, అకంపనుడి పైకి వెళ్ళాడు. అకంపనుడు తన బాణాలతో ఆ కొండ శిఖరాన్ని ముక్కలు ముక్కలు చేసేశాడు. హనుమంతుడు మండి పడి, ఒక పెద్ద చెట్టు పెరికి, దానితో అకంప నుడి తల చితకగొట్టి చంపేశాడు. వానరులు పరమోత్సాహంతో సింహనాదాలు చేస్తూంటే, రాక్షసులు తమ ఆయుధాలు కూడా పారేసి పారిపోయారు.





# వేనుడు

ధ్రువుడికి భ్రమి అనే భార్య వల్ల కల్పుడూ, వత్సలుడూ; ఇల అనే భార్య వల్ల ఉత్కలు డనే కొడుకూ, ఒక కూతురూ కలిగినట్టు మనం తెలుసుకుని ఉన్నాం కద. ధ్రువుడు రాజ్యత్యాగం చేసి తపస్సు చేసుకుంటానని బదరీ వనానికి వెళ్ళాక ఆయన కొడుకు లందరిలోకీ పెద్ద వాడైన ఉత్కలుడికి రాజ్యాభిషేకం చేద్దామనుకున్నారు. అయితే ఉత్కలుడు మహా జ్ఞాని. అతను పైకి చూడటానికి మూగవాడూ, గుడ్డివాడూ, చెవిటివాడూ అన్నట్టుగా ప్రవర్తించుతూ రాజ్యాన్ని నిరాకరించాడు. అది చూసి కుల పెద్దలూ, మంత్రులూ ఉత్కలుణ్ణి వెర్రి వాడికింద జమకట్టి, భ్రమి కొడుకైన వత్సరుడికి రాజ్యాభిషేకం చేశారు.

వత్సరుడికి ఆరుగురు కొడుకులు కలిగారు. వారిలో పుష్పార్ణు డనే వాడు వంశోద్ధారకుడు. అతనికి ఇద్దరు భార్యల యందు తిరిగి ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో వ్యుష్టి అనే వాడికి సర్వతేజు డనే కొడుకు పుట్టాడు. సర్వతేజుడికి చక్షు డనే వాడు కొడుకు; ఇతను ఒక మనువు. ఇతనికి పన్నెండు మంది కొడుకులు కలిగారు. వారిలో ఉల్ముకు డనే వాడికి ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో అందరికన్న పెద్దవాడు అంగు డనే వాడు. అంగుడి భార్య పేరు సునీథ.

అంగుడు రాజర్షిగా ప్రఖ్యాతి చెందిన వాడు. ఆయన ఒక సారి అశ్వమేధయాగం చేశాడు. యాగం నడపటానికి గొప్ప ఋత్విజులను ఏర్పాటు చేసుకున్నాడు. వారు ఎంతో శ్రద్ధతోనూ నియమంతోనూ యాగం జరిపించారు. అయినప్పటికీ హవ్యాలు తీసుకోమని వారు దేవతలను ఆహ్వానించి నప్పుడు దేవతలు రాలేదు. ఋత్విజులకు ఆశ్చర్యం కలిగింది.







వారు అంగుడితో, "రాజా, దేవతలు వచ్చి హవ్యాలు పుచ్చుకోకుండా ఉన్నారు. హవ్యాలు నిర్దుష్టమైనవి. శ్రద్ధలో లోప మేమీ జరగలేదు. బ్రాహ్మణులు చదివిన మంత్రాలు శక్తివంత మైనవి. దేవతలకు ఎలాటి అపచారమూ జరిగినట్టు కనబడదు. అయినా దేవతలు రాకుండా ఉన్నారు," అని చెప్పారు.

ఈ పరిస్థితికి అంగుడు చాలా నొచ్చుకుని, సదస్యుల అనుమతితో మౌనవ్రతం విసర్జించి, "సదస్యులారా, నా యాగానికి ఆహ్వానించి నప్పటికీ దేవత లెందుకు రాకుండా ఉన్నారు? నా వల్ల జరిగిన తప్పేమిటి? తెలిసినవారు చెప్పవలసి నదిగా అర్థిస్తున్నాను," అన్నాడు.

దానికి సదస్యులు, "రాజా, నీ వల్ల వేరే తప్పేమీ లేదు. కాని సంతాన హీనుడవైన పాపం నిన్నంటి ఉన్నది. పుత్ర కామేష్టి చేసి పుత్ర ప్రాప్తి కలిగినప్పుడా పాపం హరించి పోతుంది. పుత్రకామేష్టిలో నీ వా మహావిష్ణువును అరాధించినట్టయితే, మహా విష్ణువు వెంట సకల దేవతలూ వచ్చి తమ తమ హవిర్భాగాలు తప్పక స్వీకరిస్తారు," అని చెప్పారు.

అప్పుడు అంగుడు పుత్రకామేష్టి వ్రతం ప్రారంభించాడు.

ఋత్విజులు విష్ణువు కోసం ప్రత్యేకమైన పురోడాశాన్ని తయారు చేసి వేదోక్తంగా వేల్చే సరికి, హోమగుండం నుంచి ఒక దివ్య పురుషుడు బంగారు పాత్రలో సిద్ధ పాయసం తీసుకుని ప్రత్యక్షమయాడు. బ్రాహ్మణుల అనుమతితో అంగుడు ఆ పాయస పాత్రను గ్రహించి, తాను వాసన చూసి, తినటానికి తన భార్య అయిన సునీథ కిచ్చాడు.

సునీథ ఆ పాయసాన్ని భుజించి, దాని ప్రభావం చేత గర్భవతి అయి, సకాలాన ఒక కొడుకును కన్నది. వాడికి వేను డని పేరు పెట్టుకున్నారు.



సునీథ తండ్రి మృత్యువు అనేవాడు మహా పాపాత్ముడు. వేనుడికి ఆ తాతపోలికే వచ్చింది. అతను చిన్నతనం నుంచీ చాలా దుష్టుడు, ఎప్పుడూ పాపిష్టి పనులే చేసే వాడు. విల్లూ, బాణాలూ తీసుకుని అడవికి పోయి, నిష్కారణంగా సాధు మృగాలను చంపే వాడు. తోటి పిల్లలను క్రూరంగా హింసించే వాడు. వేనుడి పేరు చెబితే అందరూ అసహ్యించుకునే వారు.

కొడుకులు లేరని ఎన్నడూ విచారించి ఎరగని అంగుడు, తన కడుపు చెడ బుట్టిన వేనుణ్ణి గురించి చాలా బాధపడ్డాడు. వాడి దుర్బుద్ధి మరల్చటానికి ఆయన చేసిన ప్రయత్న మంతా వృథా అయింది. వేనుడి దుష్ప్రవర్తనకు తండ్రి దిగులుపడి, దిగులు పడి, చిట్టచివరకు, అలాటి కొడుకు వల్ల కూడా ఒక ఉపయోగం ఉందని తెలుసు కున్నాడు. ఆయనకు ఐహిక జీవితం పైన రోత పుట్టింది. ఒక నాటి అర్ధరాత్రి ఆయన తన భార్యనూ, సకల సంపదలూ గల తన రాజభవనాన్నీ విడిచిపెట్టి అరణ్యానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు రాజు కనిపించక పోయేసరికి పురోహితులూ, మంత్రులూ, బంధువులూ చాలా ఆందోళనచెంది, ఆయన కోసం ఎంత



గానో వెతికారు; కాని వారి కాయన జాడ తెలియలేదు.

రాజు లేక పోవటంతో అరాజకం ఏర్పడింది. భృగువు మొదలైన మునులు ఈ పరిస్థితిని గురించి విచారించి, వేనుడు దుర్మార్గుడై నప్పటికీ, రాజు లేని దానికంటె దుర్మార్గుడైన రాజుండటమే కొంత మేలని నిశ్చయించారు.

వారు సునీథతో చెప్పి వేనుడికి రాజ్యాభిషేకం చేయించారు.

రాజైనది మొదలు వేనుడు మదించిన ఏనుగులాగా సంచరించసాగాడు. అతను గొప్పవారి నందరినీ అవమానించాడు.





105

యజ్ఞాలూ, దానాలూ, హోమాలూ కట్టి పెట్టమని బ్రాహ్మణులను ఆదేశించాడు. ధర్మాలన్నిటినీ నిషేధిస్తూ చాటింపులు వేయించాడు. వేనుడి దుష్పరిపాలనలో ఒక వంక రాజు వల్లా, మరొక వంక దొంగల వల్లా ప్రజలకు పీడకలిగి, కల్తైను రెండు చివరలా ముట్టించి నట్టయింది.

వేనుణ్ణి రాజుగా చెయ్యటంలో తాము చేసిన పొరపాటు మునులకు తెలిసి వచ్చింది. వారు వేనుడి వద్దకు వెళ్ళి సౌమ్యంగానే, "రాజా, మా విజ్ఞాపన ఒకటి విను. అందువల్ల నీకు ఆయురైశ్వర్యాలూ, కీర్తీ పెరుగుతాయి. ప్రజాక్షేమానికి ధర్మం అవసరం. దాన్ని నిలబెట్టిన వాడికి ఇహమూ, పరమూ కూడా ఉంటాయి. ధర్మం నశించిననాడు రాజు ఐశ్వర్యం నశిస్తుంది. ప్రజా క్షేమమే గదా రాజు ఐశ్వర్యానికి మూలం! దుష్టులైన మంత్రుల నుంచీ, తస్కరుల నుంచీ ప్రజలను రాజు కాపాడాలి. ప్రజలు తమ తమ వర్ణాశ్రమాలకు తగిన రీతిగా యజ్ఞపురుషుడైన భగవంతుణ్ణి ఆరాధించటం ధర్మం. యజ్ఞాల ద్వారా దేవతలు తృప్తులై ప్రజల కామ్యాలు తీరుస్తారు. అలాటప్పుడు యజ్ఞాలను నిషేధించటం తగని పని," అని హితం చెప్పారు.

అంతా విని వేనుడు మునులతో, "అయ్యో, మీరెంత మూర్ఖులు! సమస్తాన్నీ ఇవ్వగలిగి, ఈశ్వరరూపడనైన నన్ను కాదని ఎవరినో కొలుస్తామంటా రేమిటి? యజ్ఞ పురుషుడంటున్నారే, ఎవడు వాడు? త్రిమూర్తులూ, దిక్పాలకులూ మొదలుగా గల దేవతలందరూ రాజు దేహంలోనే ఉంటారు గద! అందు చేత మీరు మీ బలులు నాకే అర్పించండి. ధర్మమనే పేరుతో నాకు అధర్మం బోధించకండి," అన్నాడు.

వేనుడు మారడని నిశ్చయించుకుని మునులు అతన్ని చంపేసి, తమ దారిన తాము వెళ్ళిపోయారు.



# 36. శ్వేతలుంగ బుద్ధుడు

ఈ విగ్రహం క్రీ. శ. 994 లో తయారయిందని ఊహిస్తున్నారు. ఇది పెగు [బర్మా]లో ఉన్నది. 1757 లో అలోంగ్ప్రాయా అనే రాజు పెగును కొల్లగొట్టినప్పు డిది అరణ్యం మధ్య దిబ్బ వేసి అజ్ఞాతమై పోయింది. తిరిగి 1881 లో రైలు మార్గం వేసే సమయంలో ఇది బయటపడి పునఃప్రతిష్ఠ పొందింది. చిరునవ్వు నవ్వే ఈ విగ్రహం పడుకుని ఉన్న బుద్ధుణ్ణి చిత్రిస్తున్నది. దీని నిడివి 181 అడుగులు.



Photo by T. S. Nagarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

గజరాజు చచ్చినా తల చేయు వేలు

పంపినవారు :
ఎన్. కె. రావు, తమ్మవరం

Photo by K. P. A. Swamy



బహుమతి
పొందిన వ్యాఖ్య

యజమాని చచ్చినా వదల వీ పేలు

పంపినవారు :
ఎస్. కె. రావు, తమ్మవరం

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటొల వ్యాఖ్యలు 1965 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో **అత్యుత్తమంగా** వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గజరాజు చచ్చినా తల చేయు వేలు

రెండవ ఫోటో : యజమాని చచ్చినా వదల వీ పేలు

పంపినవారు : నాగాభట్ల కామేశ్వరరావు,

తమ్మవరం (తూ. గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

సంతోషదాయకమైన ఈ దీపావళీ పర్వకాలమున అందరకూ మా స్నేహపూర్వకమైన శుభాకాంక్షలు



# పి. మునిరత్నం నాయుడు & సన్సు

కాగితములు, స్టేషనరీ వ్యాపారులు

స్థాపితం: 1913

10, స్ప్రింగర్ స్ట్రీట్ :: మదరాసు - 1

ఫోన్: 23513

తంతి: "STATIONERS"

హెడ్డాఫీసు:

వేలూరు

# దిలీపు బృందం

## గోలీల ఆట




మనం ఏదేనా చేస్తే బాగుంటుందర్రా!
వానపడుతోందేమో ఏమీ తోచడంలేదు!


నేను చెప్పనా! గోలీలు ఆడుకుందాం!
పదండి! అద్భుతం!
భలే ఉద్దేశంరా!


ఇవిగో నీవంతు నాలుగు గోలీలు అశోక్! ఇప్పుడు అందరికీ గోలీలు సమంగా వచ్చాయి!


ఇక్కడ చీకటిగావుంది!
ఓ.కే. ఓ నిమిషం వుండండి! టేబిల్ ల్యాంపు తీసుకొస్తా!
నిజంగానే, దీపం వుండాలి!




అబ్బాయిలూ! దీపాలన్నీ ఆరిపోయాయ్!
దిలీప్!
అరుగో మీ నాన్నగారు, దిలీప్! కోపంగా వున్నట్టున్నారు!


దిలీప్, ఏమిచేద్దామనిరా! ఫ్యూజు పోయింది!
అయ్యో, అలాగా నాన్నా! మన 'ఎవరెడి' టార్చితో ఫ్యూజు ఎక్కడుందో చూపిస్తా వుండు నాన్నా!


ఇలాచూడు! ఫ్యూజు వేసేసా! సమయానికి నీ టార్చి పనికొచ్చింది!
FUSE BOX
పదండి, మళ్ళీ మనం ఆడుకోవచ్చు!
శభాష్. దిలీప్!


ఇంటింటా ఓ 'ఎవరెడి' టార్చి వుండితీరాలి!




# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండ జలుబుకు, సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి, తలనొప్పికి, బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబాని కర్తా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి - కలకత్తా • ఢిల్లీ

JWT/AM/2817




# స్పెక్ట్రమ్

## రంగు పెన్సిళ్లు

పిల్లల డ్రాయింగుకు, మ్యాప్-డ్రాయింగుకు
చాలా అవసరం. అనేక రంగుల్లో దొరకును.

తయారుచేయువారు:

**ది మద్రాస్ పెన్సిల్ ఫ్యాక్టరి**

మద్రాసు - 21

ఎల్. & సి. హార్డ్‌మత్ (గ్రేట్ బ్రిటన్) లిమిటెడ్.
కోహినూర్ పెన్సిల్ ఫ్యాక్టరీ, ఇంగ్లండు వారి సాంకేతిక సహాయముతో,









గౌరి ప్రొడక్షన్స్ సమర్పించు

# తోటలో పిల్ల కోటలో రాణి

దర్శకత్వం: కె. విశ్వనాథం  నిర్వహణ: కె. భావనారాయణ

రచన: పోతూరి . సంగీతం: కోదండపాణి . కెమెరా: వేణు . నృత్యం: చోప్రా

పూర్ణా
రిలీజ్

